



తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయ గోపురము



పుష్కరిణి (ఎగువ తిరుపతి)

By Sri. S. T. Arasu



# కండరముల నొప్పియా?

NOPAIN
AN ANALGESIC BALM
RELIEVES ALL PAINS: RHEUMATISM HEADACHES, NEURALGIA BRUISES, CHEST COLDS ETC ETC.
CALCHEMICO
MADE IN INDIA
THE CALCUTTA CHEMICAL CO. LTD. CALCUTTA 29

# నోపెయిన్

## నొప్పిని త్వరలో తగ్గించును

సీలువేయబడి పరిశుభ్రమైన
గొట్టములలో లభించును

**కలకత్తా కెమికల్ వారుచేసినది**

"సౌత్ ఇండియా ఆఫీసు :5/149, బ్రాడ్వే, మద్రాసు 1."

---

సమస్త జనుల ఉత్సాహమునకు



# ఆనందసుధ

15 రోజులకు 8 ఔ॥ రు.3.0.0

శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి & సన్సు
రాజమండ్రి

బాధపడు సహోదరీ మణులకు బుద్ధిమతి



స్త్రీల ఆనందానికి

# స్త్రీసుధ

నెలకు 1 తులం రు.4.0.0

శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి & సన్సు
రాజమండ్రి

అన్ని మందుల షాపులలోను లభించును




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్ధసంవత్సరపు చంధా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసము లందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

వ్యవస్థాపకులు
డాక్టరు. కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౮]  మే 1956  [సంచిక ౮

# విషయసూచిక



ముఖచిత్రం :

గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీత శ్రీమతి కొమ్మూరి పద్మావతిదేవిగారు



—(౦)—


AMRUTANJAN

The Pain Balm

Amrutanjan Limited BOMBAY, MADRAS

అన్ని నొప్పులకు

అమృతాంజనము



డా॥ కేసరిగారి జన్మదినోత్సవ సమావేశమున స్వాగతము చెప్పుచున్న
శ్రీ సి. సి. పున్నయ్యగారు



గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీత శ్రీమతి పద్మావతీ దేవిగారు తమకు జరిపిన
సన్మానమునకు కృతజ్ఞత తెలుపుచున్నప్పటి దృశ్యము





గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీత శ్రీమతి కొమ్మూరి పద్మావతీ దేవిగారి
సమక్షమున శ్రీమతి శారదాదేవిగారు వస్త్రములను పంచి పెడుతున్న దృశ్యము





డా॥ కేసరిగారి జన్మదినోత్సవ విందు సాగిస్తున్న పరివారము




జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# భక్త్యంజలి

తన జీవయాత్రలో ప్రజాహితమును, పరోపకారమును నిర్విరామంగా ప్రోత్స హించిన పూజ్యబాబు డాక్టరు కే. యన్. కేసరిగారికి వారి జన్మదినోత్సవ సందర్భమున అంజలిఘటిస్తూ జోహారు లర్పిస్తున్నాము.

పూజ్యబాబు స్వయం నిర్మిత వ్యక్తి. అచంచలమైన ఆత్మవిశ్వాసంతో, ప్రజ్ఞా విశేషాలతో గర్భదరిద్రమునుండి కుబేరుడుగా తన జీవితాన్ని రూపొందించుకున్నాడు. తన సంపదను భోగిగా స్వార్థమున కేకాక పరోపకారానికి, ప్రజాహితానికి విశేషంగా వినియోగపరచారు.

డాక్టరు కేసరిగారి ఆదరాభిమానాలతో మోడుబారిపోయిన అనేకమంది జీవితాలు చిగిర్చినవి. అనేకులు విద్యావంతులు, పండితులు, కళాకారులు అయి తమ జీవిత రేఖలను అభ్యుదయ మార్గములలో తీర్చి దిద్దుకున్నారు.

ముఖ్యంగా విద్యా విజ్ఞాన సాంఘిక రంగాలలో వెనుకబడియుండి భారతమహిళల దైన్యావస్థ వారిని విశేషంగా ఆకర్షించింది. స్త్రీల విద్యావిజ్ఞానాల వ్యాప్తిని విశేషంగా ప్రోత్సహించారు. అనేక అనాధశరణాలయాలకు విరివిగా విరాళములిచ్చి మహిళాభ్యుదయాన్ని పెంపొందింపజేశారు. లలితకళలపట్ల వారికిగల ఆసక్తి అపారము.

మహిళాభ్యుదయాన్నుద్దేశించి 1928 లో 'గృహలక్ష్మి' పత్రికను స్థాపించి ప్రత్యేక ఆసక్తితో నిర్వహించారు. దానిద్వారా ఆర్థిక, రాజకీయ, సాంఘిక రంగాలలో మహిళల స్థితిగతులు అభివృద్ధిగాంచడానికి నూతన చైతన్యాన్ని పూరించారు. కవయిత్రులుగా, రచయిత్రులుగా, కళాకారులుగా ప్రోత్సహించడానికని 1934 లో గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానమును ప్రారంభించి తన జీవితానంతరము సయితము ప్రతిఏటా స్వర్ణకంకణ ప్రదానము శాశ్వతముగా జరుగడానికని రు. 5000/-నిధిని ఏర్పరచారు.

పూజ్యబాబుకు తన సంస్థలోని పరివారముపట్ల ఆదరాభిమానములుమెండు. తన యనంతరము తన జన్మదినమునాడు పరివారమునకు అన్నవస్త్ర ప్రదానము ఏటేటా జరుగడానికి రు. 50,000 ఆస్థిని నిధిగా ఏర్పరచి యుంచారు.

వీరి వదాన్యతకు ప్రతిబింబముగా వ్యక్తులు, సంస్థలు అనేకములున్నవి. అందులో కేసరి విద్యాలయాలు ప్రత్యేకంగా పేర్కొనతగినవి.

లోకకల్యాణంపట్ల విశేష శ్రద్ధాసక్తులు చూపి నిర్విరామంగా కృషిచేసిన పూజ్యబాబు కేసరిగారు చిరస్మరణీయులు.

---

# కీ॥ శే॥ డాక్టరు కే. యన్. కేసరిగారి

## జన్మదినోత్సవము

శ్రీ సి. సి. పున్నయ్యగారి స్వాగతవచనములు

పూజ్యులు! సోదర సోదరీమణులారా!

పూజ్యులు కేసరిగారి మరణానంతరము వారి జన్మదినోత్సవ సందర్భమున గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము జరుగడము యిది రెండవసారి.

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ.

## ఉపనిషదులు

(గతసంచిక తరువాయి)

---

పరిమితులకన్నిటికి అతీతముగా, ఆత్మ అనుభవ ప్రదుడుగానున్నాడు.

స్వయంభూః-పరిమితులకు లోనైన మానవజీవులమగు మనము, కష్టపడి, కృషి చేసి ఆత్మను తెలుసుకొనవలెనన్న, మన ఆలోచనలు, అనుభవములు పొందగల ఇంద్రియముల సహాయమున, ఈ దృశ్యద్వంద్వ ప్రపంచమునకు అతీతముగా అతనిని తెలుసుకొనవలసియున్నది. మన బుద్ధి దేశ, కాల, అవస్త, అను మూడు పరిమితులకు, లోనై వ్యవహరించవలసియున్నది. బుద్ధి యొక్క స్వభావము ఎల్లప్పుడు కారణమును వెదుకుచుండుటే. ప్రపంచమున ఎప్పుడైనను సరె, ఒకవస్తువును మనము చూచినామనగా, దానికి కారణాంశమేమియని విమర్శించుట చాల సహజము. ఇట్లు రామయ్య కృష్ణయకుమారుడు అనుటలో రామయ్యనుగురించి మరింత విశదముగ తెలిసినవారమగుచున్నాము. ఈ విశదము ఇంకను సాగవలెనన్న, కృష్ణయ్య, తండ్రి ఎవరు అతని తండ్రి ఎవరు అని ఇట్లు అంతులేక సాగుచునేయుండును. ఇట్లు విమర్శించినను, కడపట కనుగొనినవాని తండ్రి ఎవడో తెలియకయే, కార్యము పూర్తిగాక నిలిచిపోవుచున్నది. కనుక కారణాంశ పరిశోధనయే గుణముగాగల బుద్ధిని ఒకచోట అరికట్టవలసియున్నది.

ఇట్లు వేదాంత విషయమున ఆదికారణము యొకటియున్నది. అందుండియే ఈ వ్యవహారిక, ద్వంద్వ ప్రపంచమంతయు ఉత్పన్నమయి యున్నదని ఒప్పుకొనవలసియున్నది. కాని అట్టి ఆదికారణము ఇతర కారణములవల్ల సృష్టి కానట్టి స్వరూపముగానుండవలెను. ఈ భావముకే ఇచ్చట స్వయంభూః అనగా, తన వలనే జన్మముగాంచినవాడు అని తెలుపబడుచున్నది.

అది ఏ వస్తువునుండి జన్మించినదికాదు. తానే సృష్టిపొందినది. ఆత్మ ఆదికారణము. దానికివేరు కారణములేదు. ఎట్టి కారణమునకు పరిణామమగు కార్యము అదికాదు. అనుభవమును, వేదాంతమున, "స్వయంభూః" అను చిన్నవాక్యమున తెలుపబడుచున్నది. అన్నికార్యములును నశించును. ఏలన వాటికి జన్మమున్నది. ఆత్మ నాశరహితుడు కనుక అతడు జన్మరహితుడుగానుండి తీరవలెను. ఆత్మకు కారణము ఏమి అని బుద్ధి ప్రశ్నించిన యెడల, ఆత్మ కారణము లేని కారణము. లేక తానుగా జన్మించినది అని బదులు చెప్పవలెను. ఇట్టి విమర్శ, బుద్ధికి సంతృప్తికరముగానుండక పోవచ్చును. కాని ఆత్మ బుద్ధికి అతీతము అని తెలిసినవారు ఇందలి భావమును చక్కగ తెలుసుకొనగలిగియుందురు. ఇట్టి అసంతృప్తి బుద్ధి యొక్క శక్తిసామర్థ్యములు ముగిసి పోయి, తన శక్తి అతీతమైన సంగతి తెలుసుకొనుటకు వృధా ప్రయత్నము చేయుచున్నదని ప్రకటితమగుచున్నది.

ఇట్లు ఆత్మవిషయము, అభావగుణముల క్రమముగను, స్వభావగుణ వర్ణనములతోను వర్ణించియు ఋషికి తృప్తిపొందలేదు. శ్లోకము యొక్క ఛందసు ముగిసిపోయినను, తన ధోరణి సాగించుచున్నాడు. శ్లోకమునకు వికారము కలిగినను లోపముకాదని తలచి, సాధకుని సత్య ఆవరణము చేర్చి తీరవలెనను క్రమతో తన బోధ సాగించుచున్నాడు.

ఈ ఆత్మ లేక శుద్ధజ్ఞానమే ప్రకృతి యందలి సర్వ వ్యవహారములకు మూలశక్తి, బలముగానున్నా

దని తెలుపుచున్నాడు. గ్రహములన్నియు సక్రమముగా నడుచుచున్నవనిన, ఋతువులు క్రమము తప్పుటలేదనిన, ప్రకృతియందు సౌజన్యమున్నదనిన, సృష్టిక్రమము చక్కగ జరుగుచున్నదనిన, యుగముల కొలది ప్రపంచమున ఇట్టి క్రమము సాగుచున్నదనిన, సంశయములేక ఆ సర్వనియామకుడు, ధర్మశాసనకర్త ఆజ్ఞవల్లనే జరుగుచున్నవి. ఆ అధికారణము, శక్తి, బలము అంతయు సత్యస్వరూప పరమాత్మని కళ.

అన్ధన్తమః ప్రవిశన్తి యేఽవిద్యాముపాసతే।
తతో భూయ ఇవ తేతమోయ ఉ విద్యాయాంరతాః ॥౯॥

అవిద్యనుపాసించువారు అన్ధకార చీకటియందు పడుదురు. విద్యనుపాసించువారు అంతకన్న గొప్ప చీకటిగా నగుపడుదానిలో పడుదురు.

ఈ ఉపనిషదు యొక్క ప్రారంభ ఉపన్యాసములలో, ఆదర్శ జీవితమునకు కర్మమార్గము శ్రేష్టమా లేక ధ్యానమార్గము శ్రేష్టమా అనుసంశయమునకు ఈ ఉపనిషదు తగుయుత్తరముగానున్నదని తెలిపియున్నాము. శాస్త్రరీత్యా విమర్శింపగల ప్రతి తరమువారును జీవితమును సూక్ష్మముగ విచారించి, "జ్ఞానమా కర్మమా" ఏది శ్రేష్టము అను సంశయమును శాశ్వతముగ ననుభవించుచున్నారు. నేడు కూడ, మత ధర్మ జీవితమా, సంఘ జీవితమా అను సమస్య ప్రబలియున్నది. ఈ పరిభాషలన్నియు నిరంతరము ప్రతి మానవతరమువారికి మనసులోగల సంశయములకు నూతన పేర్లుగాని వేరు కాదు.

ఈ శ్లోకమునందు ఋషి, ఈ సంశయమును తేల్చి, తన తీర్మానమును మూడు మంత్రముల ద్వారా వెలిబుచ్చుచున్నాడు.

ఈ సమస్య విషయమునందు, బాహ్య వ్యవహారమునకు, ఆంతర వ్యవహారమునకు, అవిద్యయని, విద్యయని పదములు వాడియున్నాడు. ఈ పదములు ఋషుల కాలమునందు విచ్చలవిడిగా వాడబడుచుండుట వల్ల, ఆ కాలపు శిష్యులకు వాటియందలి వేదాంత భావములు స్పష్టముగా ప్రకటింప అవసరముండెను. విద్య, అవిద్యను, ఉపాసన, కర్మ అనికూడ తెలుపుట కద్దు. ఇట్టి భావమున, వేదవిహిత కర్మమందు నిమగ్నులైయుండువారు దట్టపు భ్రమయందు చేరుచున్నారు. వేదవిహితకర్మ చేయువారు, పుణ్యప్రాప్తికై కోరికలచే ప్రేరేపింపబడుచున్నారు. కనుక యజ్ఞయాగములు, వేద బోధ చేయువారు, ఉన్నత సుఖానుభవము పొంద కోరియే చేయుచుందురు. కాబట్టి ఋషుల పరిపూర్ణదృష్టియందు వీరు దైవీక గుణపతనముగాంచి, అంధకార చీకటియందు పడుచున్నారు. ఉపాసన మార్గము నవలంభించువారు, ఉన్నత, ధ్యానము చేత, ఆంతర జీవితము ననుభవించుచు సర్వ వ్యాపి సత్యస్వరూపుని మాత్రము కోరుచున్నారు. వీరు అంతకన్న గొప్పదిగా నగుపడు అంధకారమున పడుచున్నారు. ఎందుకన, యోగ్యత సంపాదించుకొనక, అతిసాహస ధ్యానమువల్ల కార్యములు మితిమీరి శూన్యభావ గుడ్డి సిద్ధాంతమును చేరగలుగుచున్నారు. ఇచ్చట "గొప్పదిగా నగుపడు అంధకారము" అనునది చాల విశేషము. అది నిజముగా అంధకారము కాదు అని సూచన.

అన్యదేవాహుర్విద్యయాన్యదాహురవిద్యయా।
ఇతి శుశ్రుమ ధీరాణాం యే నస్తద్విచచక్షిరే ౧౦.

విద్యవల్ల ఒక వస్తువు పొందనగును, అవిద్యవల్ల మరియొకటి పొందనగునని వదంతి. వ్యాఖ్యానకర్తలు ఇట్లు చెప్పుచుండగా మేము వినియున్నాము.

విద్యను గురించి, అవిద్యను గురించియు, సాధారణ శాస్త్రరీతిగను, సామాన్య వాడుక ప్రకారమును తాను చెప్పగలిగినది తెలిపిన వెనుక, ఋషి ఈ విషయమును విపులము చేయుచు, ఇందుకొరకు శ్రోతృధోర

ణీయు, విపరీత సిద్ధాంతమును స్థాపించుచున్నాడు. ఇట్లు చేయుటకు తగు ఆధారము అతడు తెలుపవలసి యున్నది. ఇచ్చట సామాన్య వాడుకలో నుండు అర్థము పూర్తి సత్యార్థమును, తెలుపుటలేదు, అని ఋషి తెలుపుచున్నాడు. అనగా, విద్య అవిద్య పరస్పర విరుద్ధమనియు, వాటికి సామాన్యవాడుకలో నుండు అభిప్రాయమును గమనించకూడదు అని తెలుపుచున్నాడు.

ఇట్లు తెలుపుచు, వెంటనే, ఈ భావము, మా స్వకపోల సృష్టిగాదు. జ్ఞానఘనులు మాకు వివరింపగా మేము వినిన విషయమును తెలుపుచున్నాను అని ప్రకటించుచున్నాడు. ఈ భావము మిక్కిలి గమనించతగినది. ఏలన, హిందూమతమున, ఏ వేదాంత విషయముగాని, ఒక మహనీయుడవతరించినంతనే అది జ్ఞాన సిద్ధాంతమని స్వీకరింపబడుట లేదు. ఒక వ్యక్తి ఎంతటి మహనీయుడైనను సరే, అతడు తెలిపిన వేదాంత సిద్ధాంతమును సామాన్య మానవునికి ఆచరణకై నిర్బంధింపబడుట లేదు. పాశ్చాత్య దేశములందువలె, ఒకడు ఒక సత్య వచనమును వక్కాణించినంతనే, అందరు దానిని ఆమోదించుటలేదు. కాని కాలాంతరమున, తరతరములవారి వ్యక్తిగత అనుభవమున అట్టి సిద్ధాంతమును పరీక్షింపబడి అచలముగానున్నయెడల, అట్టివాటిని స్వీకరించుచున్నారు.

ఇట్లు హిందు మతము ఒక్క పైగంబరుని వాక్య సిద్ధాంతమువలన సృష్టింపబడినదికాదు. అనేక బ్రహ్మానుభూతి పొందిన మహనీయుల జ్ఞాన సిద్ధాంతములవల్ల ఏర్పడి, తరములుగా, శిష్య పరంపరగా జీవనానుభవము పొందిన సిద్ధాంతములతో ఏర్పడి యున్నది. ఆర్యజాతి భక్తులు, తరతరములుగా జీవిత పరీక్షలో స్థిరముగా తేలిన సత్య సిద్ధాంతములనే ఆమోదించుచున్నారు.

విద్య, అవిద్య రెండును బంధములే. జ్ఞానమువల్ల అజ్ఞాన బంధములు తొలగగలవు. కాని, జ్ఞానము పరిపూర్ణ ఆత్మయందు యొక కష్టతర పరిమితిని నెలకొల్పుచున్నది. జ్ఞానమువల్ల అజ్ఞాన భ్రమలు తొలుగవచ్చును. కాని ఇట్టి సాధనలవల్ల జ్ఞాన పరిమితికి లోపల బద్ధులగుచున్నాము. వీటి రెంటిని అతిక్రమించ గలిగిన, పరిపూర్ణ ఆత్మపదవిని పొంద గలుగుచున్నాము.

రాబోవు శ్లోకమున, ఈ విద్య అవిద్యల మధ్య గల సంభందమును, వాటియొక్క నిశ్చిత సూచకమును తెలుపబడుచున్నది.

( సశేషము )



# భార్య - భర్త

శ్రీమతి కె. పార్వతీదేవి

భర్త: ఏయ్... నిన్నే ఈలారా?

భార్య: (లోపలనుండి) ఎందుకండి? అన్నం వార్చాలి.

భర్త:-రమ్మంటుంటే ఏమిటా పెంకి సమాధానము?

భార్య:-అబ్బ ఉండండి? అన్నం మెత్త పడుతుంది.

భర్త:-నీకేమన్నా పొగరా... రమ్మంటుంటే...

భార్య:-ఏమిటండి? పొయ్యి మండక నేను సతమతమవుతూంటే!

భర్త:-ముందు వస్తావా? రావా?

భార్య:-అబ్బ! ఉండండి! వస్తున్నాను... (పొయ్యిలోని పొగకు కళ్ళనుండి నీరు కారుతూ ప్రవేశిస్తుంది)
ఏమిటండి?

భర్త:-ఏమిటా దరిద్రము... ఎప్పుడూ ఏడుస్తూనే ఉంటావు... ఛీ... నీ జన్మ తగలెయ్య... నీ బ్రతుకు ఎప్పుడింతే తే...

భార్య:-సరేలేండి? ఎవరన్నా వింటే నవ్వుతారు... ఏమిటి? చెప్పండి?

భర్త:-ఎంత సంగనాచిలాగా అడుగుతున్నావు? దొంగ తనము రంకు తనము ఏడు ఘడియల కంటే ఎక్కువ దాగదు... తెలుసా?

భార్య:-అయితే నేను ఏమి చేశానని యిప్పుడు!

భర్త:-నీకు తెలియదూ...? సంగనాచి లాగా మాట్లాడుతున్నావు?

భార్య:-(నవ్వుతూ) సరే! నేను వెళుతున్నాను.

భర్త:-ఆగు! నా ప్రశ్నకు సమాధానము చెప్పు?

భార్య:-ఏమిటండీ ఈ ధోరణి?

భర్త-నీకు ధోరణిగానే ఉంటుంది. నలుగురిలో నన్ను నవ్వులపాలు చేశావు? నా ప్రతిష్ట నాశనము చేశావు. నీవు ఎంతకైనా సమర్ధురాలివి!

భార్య:-చంపక చెప్పండీ? ఏం జరిగిందండి?

భర్త:-ఎంత జరగాలో అంతా జరిగింది. అందరి ఆడవాళ్ళవంటి దానవుగావు నీవు... తలలు మార్చగలదానివి?

భార్య :—నన్ను విసిగించక చెప్పండి? నే నేం చేశానో?

భర్త:—అదే నేను అడుగుతున్నాను ... నీ వేంచేశావు?

భార్య :—మీరే చెప్పండి?

భర్త —చేసిన దానివి నీవే చెప్పకపోతే... విన్నవాడను నేనా చెప్పేది. నీవు చేసినదంతా నీవే చెప్పు?

భార్య :— ఏమిటండీ? ఇన్ని రోజుల నుండి లేనిది ఈ రోజు ఏమిటి? అదోరకముగా మాట్లాడుతున్నారు.

భర్త :-నీకు అట్లాగే వినపడుతుంది. బజారుకు వెళ్లు తెలుస్తుంది...

భార్య :— బజారులో అనుకునేంత పని నే నేం చేశాను.

భర్త ;—ఏమి చేశావో... ఎవరికి తెలుసు?

భార్య :—అనవసరంగా మాట్లాడకండి? ఎంత వరకు మాట్లాడాలో అంతవరకు మాట్లాడండి!

భర్త :—ఏమీ .. పరపురుషుని పక్కలో పెట్టుకొని పరాచకా లాడవచ్చు గాని... తాళి కట్టిన భర్త ఉన్నమాట అంటే అంత ఉలుకా?

భార్య : (కళ్ళ నిండా నీరు నిండును) (ఏడుస్తూ) ఏమిటండీ ఈఅఘాయిత్యము. మీరు తెలిసే మాట్లాడుతున్నారా? ఎందుకండీ? ఈరోజు ఈలా అడుగుతున్నారు... నన్ను పరీక్షిస్తున్నారా?

భర్త :— అబ్బో! మహా పతివ్రత బయలు దేరింది... సతీ అనసూయ కదూ...

భార్య :— నేను కాపురానికి వచ్చి పది సంవత్సరము లయిందికదా? ఆ మాత్రము నా మనసు గ్రహించలేరా?

భర్త:—సరె... నిన్ను ఎంత ప్రేమతో చూచానో... ఎన్ని కోర్కెలు తీర్చానో నీతో ఏ విధముగా ప్రవర్తించానో అది నాకేకాక నీకుకూడా తెలుసు. నిన్ను ప్రేమించే నాకే అపరాధము తల పెట్టావు. ఇక నీకు యిక్కడ స్థానము లేదు.

భార్య :-మీ పాదాలు పట్టుకుంటాను. ఇటువంటి మాటలనకండి. కావాలంటే నన్ను కత్తితో పొడిచి చంపండి (అని రెండు పాదాలు కట్టుకొనును)

భర్త :-నీవా... నా పాదాలు పట్టుకొని అపవిత్రముచేశావు... ఛీపో...(నెట్టును)

భార్య :—నా బొందిలో ప్రాణముండగా నా పతినుండి నన్నెవ్వరూ విడదీయలేరు. నా ప్రాణాలు ఈ పాదాల దగ్గర పోవాల్సిందే. (అని ఏడుస్తూ తలను రెండు పాదాలపై ఉంచును)

భర్త:-నిన్ను దయతలుస్తే నీ పాపములో భాగము పంచుకోవలసి వస్తుంది. నేను నిన్ను చూచిన చూపుకు నీవు చేసిన పనికి నిన్ను భగవంతుడైనా క్షమిస్తాడా?

భార్య:-మీరు ఎన్నయినా అనండి ... నేను ఏపాపము ఎరుగను .. మీమీద ఒట్టు.

భర్త:-ఓహో .... నేను బ్రతికి ఉండటము గూడ యిష్టములేదన్నమాట!

భార్య:-నన్ను ఎందుకింత బాధ పెడతారు కత్తితో పొడవండి హాయిగా ప్రాణాలు విడుస్తాను.

భర్త:-హాయిగా ... నీయిష్టము వచ్చిన చోటుకే వెళ్లు ... నిన్ను నీ పాపానికే వదలుతున్నాను. ఏచేతులతో నిన్ను అలంకరించానో ఆ చేతులతోనే నిన్ను నాశనము చేయలేను. పాపపుణ్యాలు విచారించే భగవంతుడు నీకు తగిన శిక్ష విధిస్తాడు. ఇక నీముఖము నాకు ఎన్నటికీ చూపించకు. పో ...

భార్య:-నన్ను అట్లా అనకండి ... నేను ఏపాపము ఎరుగను... మిమ్ములను విడిచి ఒక్క రోజు కాదుగదా....ఒక్క నిమిషమైనా బ్రతుకగలనా? నన్ను విడువకండి? మీ పాదాలు పట్టుకుంటాను. మీరు ఏ పరీక్ష పెడితే దానికినిలుస్తాను. నన్ను మాత్రము విడివకండి...ఏమండి మీకు పుణ్యముంటుంది. అనండీ విడువనని అనండి ... ఏమండీ ... మిమ్మలనే నండీ..(గడ్డము పట్టుకొని, నావైపు చూడండి ... నేను నిర్దోషిని ... నా ముఖము చూడండి. ఎంత దీనముగా ఉందో ... నేనుపోను ... మిమ్ములను విడిచిపోను ...

భర్త:-నన్ను ఇకనైనా విడవదలచుకో లేదా ... నీకు పదివేల నమస్కారాలు చేస్తాను. వెళ్లు నా కళ్ళముందునుండి. నన్ను నవ్వులపాలుచేయకు ... కావాలంటే నీకు ధనమిస్తాను ...

భార్య:-ఆగండి...మీధనానికి హోచాకు .. ఆశించలేదు ... నన్ను నిలువునా చీల్చినా సరే .... నా మీద మాత్రము అపనిందవేయకండి. మీ పాపము మీరే అనుభవిస్తారు. ఒకనాటికి పశ్చాత్తాపపడక పోరు ...

భర్త:-ఈ వేదాంతాలకేమిలే.. పోతావా పోవా...

భార్య:-పోను ... ముమ్మాటికి పోను....

భర్త:-ఏం చేస్తానో తెలుసా ....

భార్య:-ఏమన్నా చెయ్యండి ... చంపినా సరె...

భర్త:-నా దగ్గర నీ పప్పులుడకవు... వెళ్లు ముందర...

భార్య:-వెళుతాను .... (ఆలోచించి) అయితే వుండండి తలను స్తంభానికి వేసి బాదుకోబోతుంది.

భర్త:-ఆగు అనసూ . నిన్ను బాధపెట్టి నందుకు నన్ను క్షమించు ...

భార్య:-నిజమా ... ఎంతమాట...నన్నే మీరు క్షమించండి.

భర్త:-ఇదంతా కలగా మర్చిపో ... నేను నిన్ను ఎంతో బాధ పెట్టాను. లే (అని లేవదీసి కళ్ళనీళ్ళను తుడుస్తూ) ఎందుకు అంతభయము. ఈ చిన్న విషయానికి యింత దుఃఖించాలా?

భార్య:-ఇంక ఎప్పటికీ ఈలాటి మాటలు మాట్లడనని చేతిలోచెయ్యి వెయ్యండి (అని గట్టిగా కౌగలించుకొనును)

భర్త: (వీపు నిమురుతూ) నిన్ను విడచి నేను బ్రతుకగలనా....ఎంత అమాయకురాలివి....అసలు సంగతి చెప్పనా

భార్య:-ఏమిటండీ

భర్త:-రేపు నాటకములో వేషము వేస్తున్నాను.

భార్య:-వేస్తే?

భర్త:-యిపుడు నేను మాట్లాడినదంతా నా పోర్షన్.

భార్య:-చంపారు. అయితే ముందు ఎందుకు చెప్పలేదు.

భర్త:-చెప్తే... ఆభావాలు నీకు రాకపోవును...నీకు రాకపోతే నాకు రావు.

భార్య:-ఇదంతా నటనా? ఎంత బాగా నటించారండి! నిజమనుకొని చచ్చానంటే... నమ్మండి... రేపు డ్రామాలో మీదే ఫస్టు ప్రయిజు. ఆ ప్రయిజు నాకేయివ్వాలండి.

భర్త:-ఆ ప్రయిజు రేపు .... ఈ నాటికి ప్రయిజు (అని ముద్దు పెట్టుకొనును)



# బుద్ధభగవానుని సందేశం

రచన: డా. ఎస్. రాధాకృష్ణన్

ప్రపంచంలో యదార్థమైన హేతువాది అంటూ ఎవరైనా ఉంటే, ఆయన బుద్ధ భగవానుడే తప్ప మరొకరు కాదు. పరోక్ష ప్రమాణాన్ని పురస్కరించుకొని ఏదీ నమ్మరాదని ఆయన వాదం. "పరీక్షా భిక్షవోగ్రాహ్యం మద్వచోనతు గౌరవాత్" అని ఆయన అన్నారు. "నా ప్రవచనాలను పరీక్షించండి; నాయెడ గౌరవాన్నిబట్టి ఏదీ నమ్మకండి; తర్క పరీక్షకు, అనుభవ పరీక్షకు నిలిచేదే స్వీకరణయోగ్యం. ఆ పరీక్షకు నిలవని దానిని తిరస్కరించడమే కర్తవ్యం" అని దీని అర్థం.

ప్రతి వ్యక్తిలోనూ అంతర్నిహితమై ఉన్న బుద్ధి అంతఃకరణాలే సత్యాసత్య నిర్ణయానికి సమగ్రమైన సాధనాలు. అందుచేత ఆయన బుద్ధినే ప్రమాణంగా స్వీకరించారు. బుద్ధితో వివేచించి చూడగా, యీ జగత్తులోని సర్వమూ క్షణ భంగురమైనదనీ, అన్ని వస్తువులూ నశ్వరమైనవేననీ, ఆయనకు గోచరించింది. తొలిసారి రుగ్ణుణ్ణి, వృద్ధుణ్ణి, మృతుణ్ణి చూచినప్పుడు, ఆయన యీ విధంగా ఆక్రోశం వెలిబుచ్చారు:— "జరామరణ వ్యాధులనుండి తరించే మార్గం మానవ జాతికి లేదా? ఇదేనా మానవులకు గమ్యస్థానం? జన్మ మృత్యువులను అతిక్రమించిన ఉన్నత పథం మరేదైనా ఉందా? పునరపిజన్మం, పునరపి మరణం, యింతేనా జీవిత సత్యం? మానవ జీవితానికి పరమార్థం ఏమిటి?" దీనికి ఆయన జవాబిది. జన్మ మృత్యువులే జీవిత పరమార్థ మయ్యేట్టయితే, శోకమే మానవ జాతికి భాగధేయం. ఇది ఇలా కాకపోబట్టే, జగత్తు పరిణామ శీలమైంది కాబట్టే, విశ్వానికి దుఃఖాన్ని గమ్యస్థానంగా భావించకూడదు. మానవుడు ప్రపంచపు హద్దులనే కాక కాలాన్నికూడా అతిక్రమించగలడు. ఇందువల్లనే మానవ జాతికి ప్రస్తుత స్థితినుండి తరణోపాయం అనేది ఒకటి ఉంది. ఈ ప్రపంచం అడుగడుగునా శోక భయాలకు ఆలవాలమైనదిగా భావించ కూడదు. అంతిమ విజయ సిద్ధికి తప్పక అవకాశం ఉంది. బుద్ధుడు అంటే ప్రబోధం పొందినవాడు; ప్రపంచంయొక్క బంధనాలనుండి, సంసార చక్రంనుండి విముక్తుడై నిర్వాణం పొందినవాడు.

ఇతరులపై కేవలం గౌరవంవల్ల లేదా విశ్వాసంవల్ల ఏ విషయాన్నీ సత్యంగా స్వీకరించకూడదని ఆయన బోధించడంలో ఉద్దేశ్యం ఏమిటంటే, క్షణ భంగురమైన యీ జగత్తుయొక్క అంతరాంతరాలలోకి ప్రతి వ్యక్తి స్వయంగా దృష్టి సారించాలని; మార్పులేని అనంత సత్యాన్ని స్వానుభూతితో గ్రహించాలని. ఈ పరమార్థం "అజాతమైనది; అసంస్కృతమైనది". అది అట్టిది కావడం వల్లనే, మానవులు పరిణామ శీలమైన యీ ప్రపంచం నుండి విముక్తిపొంది దేశకాలాతీతమైన అనంత సత్యాన్ని చూరగొనడానికి అవకాశం ఉంది.

ఈ మతంలో మూఢంగా విశ్వసించవలసిన సూత్రాలుగాని సిద్ధాంతాలుగాని ఏమీ లేవు. ప్రపంచ గతిని జాగ్రత్తగా పరిశీలించినట్లయితే, ఈగమనం, ఈ ఘటనా పరంపరలో ఒక నియమం ఉన్నదనీ, కార్యకారణ సంబంధం లేదా "ప్రతీద్య సముత్పాదం" ఉన్నదనీ, తేలుతుంది. దీనిని బట్టి యీ విశ్వమంతా కేవలం అయోమయమై అర్థరహితమైన కాకతాళీయ సృష్టికాదనీ, అంతా విశృంఖలత, అంతా స్వైర విహారమూ కాదనీ, ప్రపంచాన్ని పర్యవేక్షిస్తూ నిర్దిష్ట మార్గాన నడిపించే అతీతమైన శక్తి ఏదో ఉందనీ స్పష్టపడుతుంది.

ప్రపంచంలో ధర్మం అనేది ఒకటి ఉంది. ఈ ధర్మపథాన్ని అవలంభించడం వల్లనే మానవుని

చైతన్యం ప్రబుద్ధమౌతుంది. "అసత్" నుంచి 'సత్యాన్ని' 'మృత్యువు' నుంచి 'అమృతత్వాన్ని' చేరుకోవాలని చెప్పి ఉన్నాం. అయితే దీనికి మార్గమేమిటి? ధర్మాన్ని అనుసరించడం; కృపాపూరితమైన జీవిత విధానాన్ని అవలంభించడం.

దయా, దమ, దానాలను మానవులు అవలంబించాలని బోధించడానికా అన్నట్లు ఉరుములు ద ద ద అనే ధ్వనులతో ఉరుముతాయని ఉపనిషత్తులలో చెప్పబడి ఉంది.

బుద్ధుని అష్టనీతి సూత్రాలలో కూడా ఇవే సూత్రాలు నిర్వచించబడ్డాయి. ధర్మానుసరణమే జీవిత సార్థక్యం. అశ్వఘోషుడు యీ విధంగా ఉద్బోధించాడు:—'ప్రసారయ ధర్మధ్వజం; ప్రతూర్య ధర్మ శంఖం; ప్రతాడయ ధర్మ దుందుభిం; ధర్మంకురు, ధర్మంకురు, ధర్మంకురు' అంటే ధర్మ దుందుభిని మ్రోగించు, ధర్మ ధ్వజాన్ని ఆరోహించు, ధర్మ శంఖాన్ని పూడించు, ధర్మాన్ని ఆదరించు అని అర్థం.

బుద్ధుడు కేవల సిద్ధాంత ప్రచారకుడు కాదు; ఆయనకు సిద్ధాంతాలలో లేశమూ నమ్మకం లేదు. సత్యం అనుభవైక వేద్యం; కేవల తార్కిక పరిశ్రమ ద్వారా సిద్ధించేది కాదు. అధ్యాత్మికమైన అంతర్దృష్టి వల్ల మాత్రమే దానిని పొందవచ్చును. "వాక్యార్థ జ్ఞానం" వల్ల, నిరంతర ప్రసంగం వల్ల కాక, ప్రత్యక్ష జ్ఞానం ద్వారా దానిని సాధించాలి. అందువల్ల "నిర్వాణం" యొక్క స్వరూప స్వభావాలేమిటి ఆయన నిర్వచించడానికి నిరాకరించాడు. తాను బద్ధ ముష్టిని కానని స్పష్టం చేశాడు. తాను ఎరిగిన ప్రతి దానినీ తేటతెల్లంగా తెలియ జెప్పడానికి ఆయనకేమీ అభ్యంతరం లేదు. కాని యీ అంతిమ సత్యాన్ని కూడా తాను వివరించి చెప్పినట్లయితే, మనం దానిని కేవలం ఆయన మీది గౌరవంతో మక్కికిమక్కిగా అనుభవజ్ఞానం లేకుండానే స్వీకరించే ప్రమాదం ఉంది. ఈ మహా యాత్రను ఎవరికివారే సాగించి, కష్టపడి గమ్యస్థానానికి చేరుకోవాలి. బుద్ధులు మార్గ నిర్దేశకులు మాత్రమే; వాటిలో మనం పడవలసిన శ్రమ మనం పడక తప్పదు. కాబట్టి యీ అంతిమ సత్యం యొక్క అనుభూతి వ్యక్తిగతమైన సాధన ద్వారానే లభిస్తుంది. ఇది ఇతరులు మనకు అరచేతి వైకుంఠంగా సంపాదించి పెట్టేది కాదు. మానవులు ధర్మచ్యుతి లేకుండా నిరంతర నైతిక మార్గావలంబులై నిర్వాణాన్ని సాధించాలని ఆయన మతం. కాని ఆ నిర్వాణం ఎట్టిదో మాత్రం ఆయన వెల్లడించడానికి నిరాకరించాడు. పరోక్ష ప్రమాణం వల్ల మనం ఏదైనా ఒక విషయం విశ్వసించినప్పుడు అన్ని యితర విషయాలూ కూడా అదే విధంగా విశ్వసించి మూఢ నమ్మకాలకు బలి కావచ్చును. అందువల్ల సిద్ధాంతాలు, విశ్వాసాలు, పరోక్ష ప్రమాణాలు అంటే ఆయనకు సుతరామూ గిట్టదు.

## మధ్యమ మార్గం.

కాబట్టి, సహేతుకమైన దృక్పథం అవలంబించి, వ్యక్తిగతానుభవం ద్వారా పరమార్థాన్ని సాధించాలని బుద్ధుని మతం. పరిణామ శీలమైన యీ జగత్తు అంతరాంతరాలలో మార్పులేని ఒక పరమ సత్యం ఇమిడి ఉందని, ఆయన కనుగొన్నారు. ఈ అనుభూతిని కరతలామలకం చేసుకోడానికి ప్రతి వ్యక్తీ 'మధ్యమ మర్గా'న్ని అనుసరించాలని ఆయన బోధించాడు. పరమ సత్యమైన యీ ప్రాతిపదిక సూత్రాలను ఎవరూ కాదనడానికి వీలు లేదు. కాని అన్ని ఇతర మతాల విషయంలో జరిగినట్లే ఈ మహనీయమైన బౌద్ధ మతం విషయంలో కూడా అభిప్రాయ భేదాలు, పూర్వోత్తర పక్షాలూ బయలుదేరి, విద్వేషం, వైమనస్యం వ్యాప్తిచెందాయి. బౌద్ధ మతం భ్రష్టమై, బుద్ధ భగవానుని ప్రతిభావంతమైన ఉపదేశాలు వివాదాల పాలయాయి.

———○———

# పెండ్లికూతురు



రచన : శ్రీ కన్నెకంటి ప్రభాకరశాస్త్రి

పచ్చని పస్పు! కాళులకు పారణి దిద్ది! వి నూత్న వస్త్రముల్
ముచ్చట గాధరించి! సుమమూర్ధము నందున పెండ్లి భాస్కమున్
హెచ్చు ప్రకాశ వంతమయి అందము గూర్చెడి పెండ్లికూతురా!
సచ్చరి తాత్మవమ్మ! సుని హారద బొందుము భోగభాగ్యముల్.

యోగ్యవునీవు! ఆంధ్ర మహిళోద్యమమందున దూకి శాంతిసా
భాగ్యములన్ సదాసమత భారత జాతికి గూర్చునట్టి నీ
భాగ్య విశేషరూపమున పావనమయ్యెను! మానవాళి! సౌ
భాగ్య! వికాసవంతవయి! చల్లగ నుండుము పెండ్లికూతురా!

అత్తమామల శ్రద్ధతో నాదరించి
ఆడ బిడ్డల ప్రేమతో చూడవమ్మ!
మరిది కనువగు కమ్మని మాతవగుచు!
శుభము పొందుము! ఒనవ సుందరాంగి!

అన్నమిడుచుండ మాతగా నాదరించి
మంతనాలాడు సమయాన మాంత్రివగుచు
కష్ట సమయాన సుక్షమా కాంతవగుచు
పడక యందున రంభవై ప్రభిభలనింపి!
శీల వత వగు మమ్మ! ఓ చిన్ని చెల్లి!

# తెల్ల రోజా!

రచయిత్రి :
ఇన్‌గే షోల్స్

అనువాదము :
డాక్టరు వి. ఎన్. శర్మ

(గతసంచిక తరువాయి)

ఆరోజున మా చెల్లి సోఫీ 21 వ పుట్టినదినం పండుగను చేసుకొనడంలో మేమంతా నిమగ్నులమై వున్నాము. మరునాడే సోఫి మ్యూనిచ్ విశ్వవిద్యాలయంలో చేరటానికి వెళ్లాలి. అమ్మా, నేనూ చెల్లి ప్రయాణానికి కావలసిన వస్తువులన్నిటినీ సర్దుతూవున్నాము. చెల్లి వీటినన్నిటినీ చూస్తూ విస్తుపోతూవుంది. అలా విస్తుపోతానికి కారణం వుంది కూడా!

విశ్వవిద్యాలయంలో పెద్ద చదువులకు ప్రవేశించాలని సోఫీకి ఎంతో కాలంనుంచి కోరిక వుంది. ఆకోరిక ఇంతవరకు కొనసాగితేగా! హైస్కూలు చదువు ముగించిందో లేదో ప్రభుత్వంవారు ఆరోజుల్లో ప్రారంభించిన విద్యార్థి సేవాదళంలో తప్పనిసరిగా చేరాలసివచ్చింది. ఆ పని అర్ధసంవత్సరంలో ముగిసిపోతుంది. అది ముగిశాక కాలేజిలో చేరవచ్చును అని ఎంతో ఉబలాట పడింది. ఆ పిల్ల ఉబలాటం కొనసాగితేగా! ... యుద్ధం ప్రారంభమయింది. ఈ సేవాదళాల్లో పనిచేసే విద్యార్థులు, విద్యార్థినులూ మరికొంతకాలం సేవచేస్తూ వుండాలని ప్రభుత్వం వారు ఉత్తరువులనిచ్చారు. ఈ సేవాదళాలని నెలకొల్పటంలో ప్రభుత్వం వారి ఆశయాలు ప్రారంభంలో ఎంతో మంచివనే విద్యార్థిలోకం తలంచింది. ఈ సేవాదళాల్లో పని చేస్తు వున్న కాలంలో విద్యార్థులు ప్రజాలోకపు పరిస్థితుల్ని చక్కగా అవగాహనం చేసుకోవచ్చు. అందు ముఖ్యంగా, పల్లెటూళ్లల్లో బీదలు సాదలు అనుభవించే బాధకు సాధకాలని ప్రత్యక్షంగా చూడవచ్చు. వాటినుంచి వాళ్లని దరిచేర్చటానికి అవసరమయిన సేవను చేస్తూ ఈ ప్రజాలోకపు తత్వాన్నే అర్ధంచేసుకొనవచ్చు. ఈ ఆశే విద్యార్థులనీ విద్యార్థినులనీ ఈ సేవారంగానికి ఆకర్షించింది. దూరపు కొండలు నునుపు అన్నట్టు బైట వున్నంతకాలం ఈ ఆశయాలు ఈ అధరాలూ ఎంతో బాగానే వున్నాయి. కాని దగ్గరకు పోయి వీటి తంతుని ప్రత్యక్షంగా చూచాక ఎటువంటివారూ నిరుత్సాహ వంతులగుదురని చెప్పటం అనవసరం...... అక్కడా మిలిటరీ శిక్షణ ప్రత్యక్షం. ప్రతి విద్యార్థీనీ తన వ్యక్తిత్వానికి ఒక నమస్కారం పెట్టాలి. దేశక్షేమం పట్ల దేశాభిమానం పట్ల తమకుగల అభిప్రాయాల్ని, ఆశయాల్ని మరచిపోవాలి. నాజీ సిద్ధాంతాల్ని అంగీకరించాలి. వాటిని ఆచరణలో పెట్టటానికి నాజీలు నిర్ణయించుకొన్న పధకాన్నే మనోవాక్కాయాలతో అంగీకరించాలి. ఆ సందర్భాన వాళ్లు అవలంభించే రాక్షస పద్ధతులకి మితం వుంటేకదూ! వాళ్లు బోధించేవన్నీ అబద్ధాల పుట్టలు. తమ తత్వాన్ని నిరోధించే వాళ్ళంతా తమ శత్రువులు, పరమ శత్రువులు. అట్టివాళ్ళని అణగదొక్కి వేయడానికి ఎట్టి పద్ధతిని అవలంభించినా తప్పేమీ లేదు. వాళ్ళు ఏదో విధంగా నాశనం కావాలి. అలా వాళ్ళు నాశనం అయ్యారా తమఉద్యమం నూరింతల వెయ్యింతలవృద్ధికి రాగలదు. అలా వృద్ధికిరావటం మనదేశంలో నేకాదు ఇతర దేశాల్లోకూడా పాతుకొని పోతుంది. అప్పుడు నాజీలు అన్నిచోట్లా తమ అధికారాన్ని ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా ఎంతో సున్నితంగా చెలాయించవచ్చు. నాజీలు పుట్టింది ఈ కార్యాన్ని సాధించటానికే. హిట్లరు అవతార పురుషుడు. అట్టి అవతార పురుషుడు జర్మనుల మధ్య 'పుట్టటం జర్మనుజాతి' అదృష్ట భాగ్యమని చెప్పాలి. పెద్దవాళ్లు పెద్దవాళ్లే. వాళ్ళ ప్రపంచంవేరు. దాని

నుంచి వాళ్ళని బయటికి తీసుకుని గావడం మన తరమా? ఈ కార్య కలాపాన్ని జయప్రదంగా నెరవేర్చగల బాధ్యత యువకులమీదే వుంది. అందు ముఖ్యంగా విద్యార్థులు, విద్యార్థినులు, ఈ విషయంలో చేయాలసిన పని ఎంతో వుంది. దాన్నే వాళ్లు యదాతథంగా నెరవేర్చాగా, దేశం బాగుపడుతుంది. తద్వారా మన అధికారం ఇతర దేశాల్లో చలాయించటానికి ఎంతో సులభమైపోతుంది...... ఈ సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టటానికి ఈ విద్యార్థి సేవా దళాలు ఎంతో వూతగా నుండగలవని అధికారులు తలంచారు. ఆ పనికోసం అవలంబించవలసి వచ్చిన సామ దాన భేదాలని కార్యరూపంలో పెట్టడానికి ఏ మాత్రం వెనుకంజ వేసినవాళ్లుకాదు. విద్యార్థుల్లో ఎంతోమంది అమాయకులు వున్నారు. వాళ్లు ఇదంతా తమ మంచికోసమే అని భ్రమసి, ఆగోతుల్లో పడిపోయారు...... కాని అందరూ అలా చేస్తారా? వాళ్లలో వీరులు వున్నారు. వీరాంగనలున్నారు. ఈ రాక్షస కృత్యాల మూలాన దేశీయులు ముందు ముందు అనుభవించాలసిన బాధలు ఏవో వాళ్ళకు తెలుసు. వాటినుంచి లోకాన్ని ముఖ్యంగా తమ దేశీయుల్ని రక్షించటానికి తామే ముందంజ వేయాలి. అలా ముందంజ వేయటంలో తామే స్వయంగా ఎదుర్కొనవలసివచ్చే అడ్డుల్ని సాహసంతో ఎదుర్కొనాలి.... అలా ఒక నిశ్చితాభిప్రాయానికి వచ్చి ఈ సేవా దళాల్లో నాజీ ప్రభుత్వం వారి సిద్ధాంతాల్ని ప్రతిఘటించిన వీరుల్లో వీరాంగనల్లో సోఫీ ఆక్రమించుకొన్న స్థానం విషయం ఇక్కడ చెప్పడం అనవసరం. అధికారులూ ఆ పిల్లని ఎన్నో బాధలు పెట్టి బాధించారు. తమ దోవకి ఆ పిల్లని త్రిప్పటానికి అవలంబించాలసిన పద్ధతులు అవలంబించారు. కాని సోఫీకి తన ఆదర్శాలేవిటో తనకి బాగా తెలుసు. వాటిని నిలుపుకొనడానికి ఆ సేవా దళంలో నాయకులు పెట్టిన అష్టకష్టాల్ని ఎంతో ధైర్యంతో, సాహసంతో, ఆనందంతో, ఎదుర్కొన్నది.......

ఈ యమ యాతనల్ని ఎదుర్కొనడం ఒక సంవత్సరమా, రెండు సంవత్సరాలా?...... ఓపికతో ఇంతకాలం వాటినంతా వోర్చుకొన్నది.......ఇంతకాలమూ విద్యార్థి సేవా దళాల్లో వున్నవాళ్ళని కళాశాలల్లో చేరటానికి, మరి ఇతర రంగాల్లో వాళ్లకి ఇష్టం వచ్చిన పనుల్లో ప్రవేశించటానికీ ఇప్పుడు అవకాశమిచ్చారు అధికార వర్గంవారు. ఈ వుచ్చులో నుంచి సోఫీ బయట పడ్డది. ఈ పుట్టినదినం పండుగని ముందు కొద్దిరోజుల క్రిందే.

అన్నయ్య – హాన్స – మ్యూనిచ్ నగరంలో వైద్య విద్యను చదువుతున్నాడు. తానూ అక్కడికే వెళ్లి తన అభిమాన శాస్త్రమగు - తత్వ శాస్త్రాన్ని చదవాలని సోఫీ వుర్రూతలూడసాగింది. ఈ పిల్ల కోమల భావాలు అమ్మకు, నాన్నకూ బాగా. తెలుసు వాళ్లూ హృదయ పూర్వకంగా సోఫీ కోరికని నెరవేర్చటానికి అంగీకరించారు.......

అమ్మ సోఫీకి కొత్త వూళ్లో అవసరమైన బట్టల్ని తయారు చేసింది. ఆమే స్వయంగా చిన్న పెట్టెలో వాటిని సర్దింది. ఇదంతా సోఫీ చూస్తూ "నిజంగా రేపేనా నా ప్రయాణం" అంటూ వుబ్బి తబ్బిబ్బయిపోతూంది. తన పుట్టిన దినం ఈ రోజే రావటం తన అదృష్ట భాగ్యం కదూ? ఈ భాగ్యాన్నే వూతగా నుంచుకొని రేపటినుంచి తన కార్యకలాపాన్ని నిర్విఘ్నంగా కొనసాగించటానికి శాయ శక్తులా ప్రయత్నించాలి. కష్టాలు వస్తాయి. వస్తాయి. ఒకటా రెండా వెయ్యి లక్షలు. తన లక్ష్యాన్ని పరీక్షించడానికి! అలా అవి వచ్చినా తన భయపడాలా...... ఇవే సోఫీ ఆలోచనలు. అమ్మ ఆ రోజున తన బట్టల్ని పెట్టెలో సర్దడం చూస్తూ వున్నంతకాలం, అమ్మే తన దుస్తుల్ని ఎంత జాగ్రత్తతో, ఎంత ఆనందంతో ఇస్త్రీ చేస్తూ వున్నది. అలా చేస్తూ వున్నప్పుడు అమ్మ బుర్రలో ఎన్నెన్ని ఆలోచనలు రేకెత్తుతూ వున్నాయో?......"అమ్మకి సోఫీ అంటే ఎంతో ఇష్టం. అది ఇంట్లో కడపటి పిల్ల. ఇతర పిల్లలకన్నా ఎంతో గారాబంగా పెంచింది. ఇంతకాలం సోఫీ - సేవా

దశలోవున్న రోజుల్లో - పడ్డ కష్టాలు ఆ తల్లికి బాగా తెలుసు. వాటినుంచి బయట పడ్డది. దాంతో ఆ కష్టాలు పోతాయా ?...... పిల్లలందరూ ఒక చోటవుండే అదృష్టం వాళ్లకి వుంటేగా !... వాళ్లకి రెక్కలు వచ్చాయి. వాళ్ళ దోవల్లో వాళ్లు వెళ్లుతూ వున్నారు...... చిన్న అబ్బాయి. వాడంటే అందరికీ చెప్పరానంత మమత. వాడు ఇప్పుడు రష్యా దేశంలో వున్నాడు. ఏం చేస్తున్నాడో ఇప్పుడు? అక్కడి వాతావరణం చరింపరానిది. దాన్లో తికమక అయిపోతూనే వుంటాడు.... తిరిగి ఎప్పుడు ఇంటికి వస్తాడో. వచ్చినా సోఫీకిమల్లీ ఎంతకాలం ఇంట్లో వుండ గలుగుతాడు? బుగ్రున మరెక్కడికో పోతాడు.... అన్నిటికి ధైర్యంతో వోర్చుకోవాలి... మన చేతులమీద వుందా ఇదంతా. భగవానుని మీద వుంది యీ భారమంతా. ఆయన దీన్నంతా చూసు కుంటాడు !" తనలోనే అంటూ అమ్మ నిట్టూర్పు విడుస్తూవుంది. కంట నీరుబెట్టింది. సోఫీ, నేనూ అక్కడే వున్నామనీ, ఆమె మనోభావాల్ని గ్రహించామనీ, అమ్మ తటాలున గుర్తించింది...... మా వంక చూసి ఒక చిరునవ్వు నవ్వింది. మా బాల్యంలో మమ్మల్ని నిద్రపుచ్చటానికి పాడుతూవుండే ఒక చిన్న జోల పాటని పాడింది. "పక్షులు ! ఎంతకాలం వుంటాయి తల్లి గూళ్ళో ! రెక్కల్ని విదుల్చుకుంటూ......" ఈ పాటలో అర్థం మాకు అప్పుడు తెలియకపోయినా ఇప్పుడు, ఈ కష్టకాలంలో తెలియకుండా ఎలా వుంటుంది.......

మా అమ్మకి వున్నంత గుండె నిబ్బరం అందరికి వుంటేనా ! ఆమె కష్టాల తల్లి, మేము పుట్టినప్పటి నుంచి తల్లి మాకోసం ఎన్ని కష్టాల్ని ఎదుర్కొనవలసి వచ్చింది ! వాటిని ఇప్పుడు తలుస్తూవుంటే గడ గడ వణకిపోక మరొక విధంగా వుండగలనా? ఒక మా కాష్టాలతో సరిపోయిందా మా అమ్మకు !...

ఒక రోజున ప్రొద్దున మేమంతా ఇంకా లేవలేదు. బయటికి తలుపుని ఎవరో దబదబ కొట్టిన శబ్దం — అలా అంత ప్రొద్దున పరాయివాళ్ళు మా ఇంట్లోకి రావడం మామూలు లేదు - విన్నదో లేదో, అమ్మ లేచి తలుపుని తెరచింది. ఇంటిముందు ప్రత్యక్షమైన మహానీయులు పోలీసువాళ్లు. గూఢ శాఖకు సంబంధించిన వాళ్లు. నాన్నతో ఏదో అవసరంగా మాట్లాడటానికి వచ్చామని చెప్పారు...... నాన్నతో వాళ్ళు ఏం మాట్లాడారో...... కొంత సేపయ్యాక వాళ్ళు నాన్నని తీసుకొని వెళ్ళిపోయారు. నాన్న ఏం అపరాధం చేశాడని ఇలా వేకువ జామున రావడం, మాతో ఏమీ చెప్పకుండా నాన్నని తీసుకొని పోవడం? ... ఈ రోజుల్లో వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఆలోచించే నాథుడు వుంటేగా ! ప్రభుత్వం వుంది. అయినా వ్యక్తుల మట్టు మర్యాదని నిలువబెట్టడం అనేది ప్రభుత్వానికి ఏకోశాన వుంటేగా !... నాన్న జైల్లో కొంతకాలం వుండాలసి వచ్చింది. తరువాత ఆయన్ని విడుదల చేశారు. ఎందుకు ఆలా చేశారో ఆ భగవానునికే తెలియాలి ! ఇంతకూ కారణం తరువాత తెలిసింది...... మా నాన్నకి స్వాతంత్ర్యమంటే ఎంతో ఇష్టం. ఇతర్లకీ అట్టి స్వాతంత్ర్యాన్నే ఇచ్చి మానవ హక్కుల్ని కాపాడేవాడు ఆయన మా వూరికి మేయరు. ఆ అధికారంలో ఎన్నో చిక్కులూ వున్నాయి. అయినా వాటిన విడదీయటానికి నదురూ బెదురూ లేకుండా తన పనిని ఎంతో చాకచక్యంతో చేశాడు. ఇది మా వూళ్లో అధికార పదవులకోసం వెర్రి వెర్రి ఆశలతోవుండే కొంతమంది పెద్దలకు నచ్చిందికాదు.... మా నాన్నకి హిట్లరు ఆరోజుల్లో చేస్తూవున్న గొడవ అంటే ఇష్టంలేదు. ఆ సంగతినే ఏదో మాటల సందర్భాన ఎవరితోనో అన్నాడు. అంతే ఆ సంగతి ఆ మనిషి పోలీసు అధికార్లకి చెప్పివేశాడు... అనేకదూ వాళ్ళకీ కావలసింది? దానికి ఇలా జైల్లో కూచోవలసి వచ్చింది....

మనుషుల్లోని మంచితనాన్ని గుర్తించేవాళ్లు వుంటేగా జీవిత రథం సవ్యంగా రాజమార్గాన కదలటానికి సాధ్యమవుతుంది ! ఇటుగోయి, అటూగోయి మధ్య ఇటువంటి మంచివాళ్ళు తికమక పడుతూ జీవితాన్ని గడుపుతూ వుండాలి. తండ్రి కష్టపడ్డాడు.

(సశేషము)

# అశ్రుతర్పణం

'పద్మ - నరేశ్'

(గతసంచిక తరువాయి)

---

నాగేష్ ఓ వారం రోజులు స్కూలుకి రావడం మానేశాడు. మూర్తి వాళ్ల యింటికిపోయి అడిగితే స్వగ్రామం వెళ్ళాడని చెప్పారు. గీత మాత్రం భయపడసాగింది. ఒక రోజు పున్నట్లుండి పూడిపడ్డాడు నాగేష్. గీతకు ఎంతో సంతోషమయింది. ఎలాగయినా ఆ రోజు నాగేష్‌ను కలుసుకోవాలని నిశ్చయించుకుంది.

సాయంత్రం గీత ముస్తాబైపోతూవుంటే చెల్లెలు లక్ష్మి ఆపడం తప్పలేదు. కానీ లక్ష్మికి ఆ మాట యీ మాటా చెప్పి తప్పించి నాగేష్‌ను కలుసుకోడానికి బయలుదేరింది. అప్పటికే కొద్ది చీకటి పడింది. అర్ధచంద్రుని వెన్నెల యిసుక దిబ్బల మీద పిండిచల్లినట్లున్నది. నాగేష్ అదివరకేవచ్చి కూనిరాగాలుతీస్తూ గీతకోసం నిరీక్షిస్తున్నాడు. గీత మెల్లగా ప్రక్కన చేరుకుంది. "పాటలో ప్రక్కన వున్న మనుష్యులనే మరచినట్లుంది ... ఏంచేస్తాము" అంది కొంటెగా.

"ఎప్పుడొచ్చావు గీతా !"

"తమరీ లోకంలో వుంటేగదూ తెలియడానికి!"

"అలాగేం !" అంటూ గీతను దగ్గరకు లాక్కున్నాడు.

"గీతా ! నీవు బాగా పాడతావటగా, ఓ పాట పాడవూ" అంటూ చెవిలో వూదాడు.

"మీ కంటేనా ?" కొంటెగా అంది గీత.

"ప్చ్, నాదేమిటి, వూసుపోని కూనిరాగాలు. నువ్వే పాడుదూ ;" అన్నాడు నాగేష్.

ఆ వెన్నెల్లో, ఆ పిల్లగాలి రాగాల్లో గీత తన పాటను శోభింపజేసింది.

"ఆకాశవీధిలో అన్నీ తారకలే
మిలమిలా మెరిసేటి యింటిచుక్కలుతేడు
మందగమనాన కదలిరాడో
పుణ్యాపాపములేమి ఎరుగమూ
ఎన్ని రోజుల పంటయో - నీ చూపుల
భాగ్యము

ఆకాశవీధిలో అన్నీ తారకలే
ఎన్ని కోరికలో ఎగసే హృదయములో
నీలిమబ్బుల చాటున ఏడదాగితివో
ఎందేగితివో కదలిరావో
కరుణలేదో కావుమోయి.
ప్రియురాలి ప్రణయభావాలు
నీ హృదయ ద్వారాల్లో
దారితీయగ తెరువుమోయీ !
పలుకొనగా కదలిరావోయి
ఆకాశవీధిలో అన్నీ తారకలే."

అని ఓ రాగాలాపన ఆ పిల్లగాలితో మేళవింపజేసింది గీతా రత్నం. నాగేష్ తనేం జేస్తున్నాడో అప్పుడేం తెలిసిరాలేదు. వెంటనే అతనినుండి విడువబడింది. నాగేష్ రత్నాన్ని వదలలేదు.

"ఏమండీ ! నన్నన్యాయం చేస్తారా ?"

"ఇది అన్యాయంకాదు గీతా !"

"అయితే నేనడిగింది చేస్తారా ?"

"తప్పకుండా."

"అయితే నన్ను పెళ్లి చేసుకోవాలి."

జవాబు యివ్వలేదు నాగేష్.

"పెళ్లి! అదెలా జరుగుతుంది. ఇంట్లోవాళ్లు సమ్మతిస్తారా?" నాగేష్‌కి ఏమీ చేయడానికి తోచలేదు. తనిప్పుడేం చెప్పగలడు? సందిగ్ధావస్థలో పడ్డాడు.

"పెళ్లి సంగతి యిప్పుడెందుకులే రత్నం?"

"చూడండి, నా శీలాన్ని నాశనంచేసి మీరేం సుఖపడ్తారు? నా చేతిలో చేయివేయండి, పెండ్లాడతానని."

కామపాశంలో యిరుక్కున్న నాగేష్ దూరాలోచనలేకుండా రత్నం చేతిలో చేయివేసాడు. రత్నం నాగేష్ ఒడిలో వాలిపోయింది. చంద్రుని మబ్బులు కప్పేశాయి. రత్నం శరీరాన్ని నాగేష్ తన దేహంతో కప్పేశాడు.

వాడిన ముఖంతో, రేగిన ముంగురులతో, చెదరిన బొట్టుతో, నలిగిన బట్టలతో గీత యిల్లుచేరి పరుపుమీద బోర్లపడి ఏడ్వసాగింది.

తనెంత నీచంగా ప్రవర్తించింది. తను యిప్పుడు శీలభ్రష్ట. స్త్రీకి శీలమే లేకపోతే సంఘంలో స్థానమే లేదు. ముందు వెనుక ఆలోచించకుండా నాగేష్‌కు తన శరీరాన్ని అప్పజెప్పింది. తనను నాగేష్ నమ్మించి గొంతుకోస్తాడేమో! ఈ సంగతి లక్ష్మికి తెలిస్తే తనకెంత సిగ్గుచేటు. గీత కంటినీరు పరుపును తడిపివేసింది.

మొదటనే గీత వైఖరిచూచి ఏదో జరిగిందనుకొన్న లక్ష్మి యిప్పుడు ఏడవడంతోటే మరీ భయపడసాగింది.

"ఏమక్కా ఏంజరిగింది?" ఆతృతతో ప్రశ్నించింది లక్ష్మి. పలుకలేదు గీత.

తిరిగి లక్ష్మి గ్రుచ్చి గ్రుచ్చి ప్రశ్నించడంతోటే గీతకు విసుగొచ్చి "పో యిక్కడనుంచి," అని కసిరింది లక్ష్మిని.

లక్ష్మి మారు మాట్లాడకుండా వెళ్లిపోయింది. అప్పటినుండి గీతవైఖరి మారిపోయింది. స్కూల్లో మౌనధారిణి. ఎవరు పిలిచినా పలుకదు. ఒకటే ఆలోచన.

ఈ విషయం జరిగి చాలా రోజులయింది. కానీ మళ్లీ నాగేష్‌ను చూచే భాగ్యం గీత నోచుకోలేకపోయింది.

### 4

ఓ నెల రోజులు గడిచాయి. నాగేష్ గీతకు కనబడకుండా తప్పించుకుని తిరగడం మొదలెట్టాడు. చివరకు నాగేష్ తనను మోసంచేసాడని నిర్ధారణ చేసుకుంది. తనలో హృదయవేదన రగలజొచ్చింది.

ఒకనాడు సాయంత్రం గీత మిద్దెమీద కూర్చొని వచ్చేపోయే జనాన్ని చూస్తూ ఏదో ఆలోచిస్తుండినది. ఒక్కసారిగా ఆమెలో ఎక్కడలేని ఆనందం, ఉత్సాహం పుట్టుకొని వచ్చాయి. వెంటనే వీధిలోకి పరుగెత్తింది.

దూరంగా నాగేష్‌రావడం గమనించింది. వీధిలోకొచ్చి నిల్చుంది. నాగేష్ గీతతట్టు చూడలేదు. ఆ యింటివైపుకూడా తన దృష్టిని మరల్చలేదు. గీత అతనితట్టు ఎంతో ఆశతో చూచింది.

ఆశ నిరాశగా మారింది. నాగేష్ ఏమీ తెలియనివాడల్లె ఆ యింటినిదాటి నాలుగడుగులు ముందుకేశాడు. గీత యిక తన హృదయతాపాన్ని భరించలేకపోయింది.

"నాగేష్‌గారూ! ఈలా ఓమారు వస్తారా?" అని పోతున్న మనిషిని ఆపింది. నాగేష్ టక్కున ఆగిపోయాడు. గీత యింటికి నాగేష్‌పోవడం అదే ప్రథమం. గీత యిల్లు పెద్దదే. ఇంటిముందు ఓ తోట. ఆ తోటలో పలురకాల పూలచెట్లు, చూడడానికెంతో ముచ్చట వేస్తూంది. ఇద్దరూ తోటలో ఒకరి కెదురుగా ఒకరు నిల్చున్నారు. కానీ ఎవరూ మాట్లాడలేదు. నాగేష్ కది కష్టంగా తోచింది.

చివరకు 'నన్నెందుకు పిల్చావ్,' ఏదో పెద్ద పెట్టున అడిగాడు. ఆ మాటల్లో ఎంతో కఠినత్వం, కోపం, గోచరిస్తున్నాయి. నాగేష్‌ను పిలిస్తే వెంటనే వచ్చిందానికి ఎంతో సంతోషించింది. అతనిమీద తన కున్న చెడ్డ అభిప్రాయాన్ని కొద్దిగా సెట్టివేసుకుంది, కానీ అతను మాట్లాడిన మాటల్లోని కఠినత్వాన్ని చూచి బెదరిపోయింది.

"ఎందుకండీ! నామీదంత కోపం, నేనేం చేసాను." జాలిగా ప్రశ్నించింది గీత.

"ఏంచేయాలేంటి? మర్యాద తెలియక్కర్లా? ఎక్కడంటే అక్కడ, అందులో నడివీధిలో అలా పిలవచ్చా?"

"నేను పిలిస్తే తప్పేండి?" ఏడుస్తూ అడిగింది గీత.

"ఏం నువ్వయితే మహారాణివా?"

"నన్న న్యాయంజేసి మీ కోరిక తీర్చుకుని, నన్ను శీలభ్రష్టగా చేస్తారా?"

నాగేష్ మధ్యాహ్నమార్తాండినిలా మండిపోతున్నాడు. శరీరం అంతా చెమట పట్టింది. "కల్లబొల్లి మాటలుమాని, పిలిచింది దేనికో చెప్పు." గర్జించాడు నాగేష్.

"ఏమన్నారు, నావి కల్లబొల్లి ఏడ్పులా? నా హృదయ వేదన మీకేం తెలుస్తుంది? చూడండి. నన్నిలా అన్యాయంచేసి మీరేం సుఖపడతారు? ఆనాడు మీరు నన్ను పెళ్లి చేసుకుంటానని వాగ్దానం చేసారే, అప్పుడే మరచిపోయారా? ఆ బాసలన్ని మీ కామం తీర్చుకోడానికేనా? మిమ్మల్ని నమ్ముకున్నాను. మీరే సర్వస్వం అనుకున్నాను. మన సారా నమ్మించి యిప్పుడిలా గొంతుకోస్తారా?"

గీత కన్నీళ్లధార ఏకంగా ప్రవహించింది. ఆమె వక్షస్థలం పూర్తిగా తడసింది. నాగేష్ ఏం మాట్లాడలేకపోయాడు. "నాగేష్! నిన్ను నేను నమ్ముకున్నాను. కానీ నీవునన్ను అన్యాయం చేసావు. నాశీలాన్ని నాశనం చేసావు. ఈ సంఘంలో నేనొక మానాభిమానాలుగల స్త్రీని అని నిలబడడానికి సూది మొనంతైన చోటు వుందా? మిమ్మల్ని ఏమంటుంది సంఘం? మీ కాళ్లు పట్టుకుంటాను. నా జీవితాన్ని నాశనం చేయకండి." అంటూ గీత నాగేష్ కాళ్లమీద పడింది. నాగేష్‌కు ఏమీ పాలుపోలేదు.

"గీతా! జరిగిందేదో జరిగింది. పశ్చాత్తాపడి లాభంలేదు. ముందు వెనుకలాలోచించకుండా యిద్దరం తప్పేచేసాము. దైవ నిర్ణయం యెలా వుంటే అలా జరుగుతుంది." అంటూ చేతులు విదిలించుకొని వెళ్లి పోయాడు.

'నాగేష్' అంటూ గీత అక్కడనే వాలిపోయింది. లక్ష్మి ఎక్కడనుంచి చూచిందో ఒక్కపరుగున వచ్చి గీతను లేవదీసుకుని పోయింది. "చూడక్కా! జరిగిందానికి వగచి ఏంప్రయోజనం? నీవారోజుల్లో సాగను చేసుకొని పోతుంటే అనుమానపడ్డాను, అది నిజమే అయింది. ఆమోసగాడిని నువ్వెందుకు నమ్మావు?" గీత లక్ష్మి తట్టు చూచేటప్పటికి లక్ష్మి కంటిలోనుంచి నీరురావడం గమనించింది. లక్ష్మి! అంటూ చెల్లెల్ని కౌగలించుకుంది గీత. ఆ కౌగలింతలో యిద్దరి హృదయాలు కలసిపోయాయి.

## 5

ఆ నాడే లక్ష్మి పేరుతో మూర్తికి ఒక వుత్తరం అందింది. అదిచూచి లక్ష్మి ఎవరిదని ఆశ్చర్యపోయాడు మూర్తి. ఆ వుత్తరం అంగిన మరునాడే మూర్తి గీత యింటికి పోయాడు. లక్ష్మి మిద్దమీద నుండే మూర్తి రాకను చూచింది. మూర్తి యింటిలోనికి ప్రవేశించగానే ఆహ్వానించి వుచితాసనం చూపించింది.

"ఏమండీ! మూర్తిగారూ! మీతో కొన్ని విషయాలు మాట్లాడాలని మా అక్క జాబువ్రాయమంటే వ్రాశాను. మీకిచ్చిన శ్రమకు క్షమించాలి."

మూర్తి. "ఫరవాలేదులెండి, యిదేమంత పెద్ద శ్రమయిన పనికాదు. అయితే యింతకూ మీ పేరేనా లక్ష్మి?" అని లక్ష్మి కళ్లల్లోకి చూచాడు.

చిన్నవవ్వు నవ్వింది, లక్ష్మి. ఇంతలో గీత వారున్న చోటికి వచ్చింది. మూర్తి గీతను చూడటంతోటే ఆశ్చర్యపోయాడు. ఆపీల్చుకపోయిన చెక్కిళ్లు, నల్లబడిన ముఖం, కండ్లలోని జాలి మూర్తిని కలవరపరిచాయి. పక్షంరోజులుగా స్కూలుకు గీత రాకుండా వుండడంలో ఏదో కారణం యిప్పుడు మరింత రూఢి అయింది. గీత ఏడుస్తూ నిలబడ్డది.

"ఏమిలా మారారు?" అంటూ జాలిగా చూచాడు గీత కండ్లలోకి.

"ఇలా అయిపోయాను. మీ స్నేహితుడు నాగేష్ బావున్నాడా?"

"ఏమిటీ_రత్నం! (మూర్తి గీతను రత్నం పేరుతో పిలవడం అలవాటు.) అతను వారం రోజులుగా స్కూలుకు రావటంలేదు. నీకతని సంగతి ఏమి తెలీదా?"

"లేదు, మూర్తీ! నాకతనగుపడి పదహైదు రోజులు పైనయింది." అంటూ వలవల ఏడ్చింది - గీత.

"ఎక్కడుండినా ఏమి సుఖపడతాడు లెండి! ఓ యువతిని అన్యాయంగా నాశనం చేసి పారిపోయిన పిరికి పందకు ఆ ఆడదాని వుసురు ఎప్పటికైనా తగులుతుంది." అంది కోపావేశంతో లక్ష్మి. మూర్తికిదేమీ అర్థంకాలేదు. "అసలు సంగతేమిటి రత్నం?"

లక్ష్మి జరిగిన కథను సవిస్తరంగా చెప్పింది మూర్తికి. మూర్తి కలలోనైనా నాగేష్ యీలాంటి పని చేస్తాడని తలంచలేదు.

"రత్నం! నిజంగా నాకీసంగతులన్నీ యింతవరకు తెలియవు. కానీ కొద్దిగా ఆలోచిస్తే నిన్నలా చేయడానికి ఏదో ఒకకారణం వుండి తీరుతుందనుకుంటాను."

"అది తెలుసుకోడానికే మిమ్మల్ని పిలవనంపించింది" అంది గీత. ఇంతలో లక్ష్మి కాఫీ తెచ్చింది. మూర్తి లక్ష్మి యిచ్చిన కాఫీ త్రాగి గీతను ఓదార్చి బయట పడ్డాడు.

## 6

అవి బాగా వానలు కురిసే రోజులు. ఓనాటి సాయంత్రం అయిదు గంటలకే బాగా చీకటి పడిపోయింది. ఆకాశం అంతా మబ్బులతో నిండి హోరున గాలి వీస్తుంది. వీధంతా నిర్మానుష్యంగా వుంది. నాగేష్ యింట్లో యేంపాలుపోలేదు. స్కూలు ముగించి వారంరోజులయింది. కారణం యింట్లో వాళ్లందరు వాళ్ల స్వగ్రామానికి వెళ్లడమే. ఇక తనపని హాయి. ఇంట్లో కూర్చొని యేదో పుస్తకము చదవనారంభించాడు. ఓ అరగంటకల్లా జోరున వర్షం కురియ సాగింది. ఇంతలో వరండాలో చప్పుడయింది. లైటు వేసి బయటికి వచ్చాడు. వాన జల్లు యింటి గడపదాకా కొట్టూంది. నాగేష్ వరండాలో కొచ్చి చుట్టూ కలయ జూచాడు. ఆ దృశ్యాన్ని తను నమ్మలేకపోయాడు. అక్కడ ఓ స్త్రీ చేతిలో పుస్తకాలు పట్టుకొని నిలబడివుంది. పూర్తిగా తడిసిపోయి వుంది. ఆమె కట్టుకున్న సన్నటిచీరెనుండి కొద్దికొద్దిగా అవయవాలు కనబడుతున్నాయి.

నాగేష్‌కు ఏం చేయాలో తెలియలేదు. ఇంట్లోకి రమ్మనాలో బయటికి పొమ్మనాలో తెలియక తికమకలు పడుతున్నాడు. అదేపురుషుడయితే పొమ్మనేవాడు కాబోలు.

"అయ్యో! తప్ప తడిసారే లోపలికి రండి!" అన్నాడు. ఆ యువతి లోపలికి పోవడానికి సంకోచించింది.

"సదభిప్రాయంతోనే చెప్తున్నాను. లోపలకి రండి." అన్నాడు నాగేష్. ఆ మాటలతో ఆయువతి మెల్లగా లోపల ప్రవేశించింది. లైట్

కాంతిలో ఆమెను నఖశిఖ పర్యంతం చూచాడు నాగేష్.

"ఫరవాలేదు. ఆ పుస్తకాలు టేబిలుమీద పెట్టి, మీరు కూర్చోండి. డ్రెస్ మార్చుకుంటారా?" సందేహంతో అడిగాడు నాగేష్. అందుకా యువతి ఏమీ పలుకలేదు. మౌనంగా తలవంచుకొని నిల్చుంది. నాగేష్ అదిగమనించి "ఫరవాలేదులెండి. అదే డ్రెస్సింగ్ రూమ్" అంటూ ఓ చీర బీరువాలోనుండి తీసుకొని వచ్చి యిచ్చాడు.

ఆ అమ్మాయి చీర మార్చుకోవడానికి డ్రెస్సింగు రూములోకెళ్లింది.

నాగేష్ యిదే అదుననుకొని ఆ అమ్మాయి పుస్తకాలను పరీక్షించాడు. కొద్దిసేపట్లో ఆ అమ్మాయి చీర మార్చుకుని వచ్చింది.

"అలా కుర్చీలో కూర్చోండి." అన్నాడు.

ఆ యువతి నాగేష్ తట్టు దొంగచూపులు చూస్తూ కుర్చీలో కూర్చుంది.

"ఏమండీ! మీ పేరేమిటో... తెలుసుకోవచ్చా?"

"సుందరి"

"సుందరి ... ఆహా ఎంత మధురాతి మధురంగా వుంది పేరు. నిజంగా సుందరే! ఇటువంటి సుందరాంగిని పొందే యువకుడు ఎంత అదృష్టవంతుడు!" అనుకున్నాడు నాగేష్ మనసులో.

"అయితే మీరు తడిసి వచ్చారేం?" తెలియనట్లు అడిగాడు.

"ఏం చేయమంటారు. స్కూలునుండి బయలుదేరివచ్చేప్పటికే వాన పట్టుకుంది. తొందరగా యిల్లు చేరదామని ప్రయత్నించాను. కానీ లాభంలేకపోయింది. ఇంతలో మీ వారండా కనుపించింది. వచ్చి నిల్చున్నాను. ఇంతకూ మీ... పేరు చెప్పలేదు." అంటూ చిన్నగా నవ్వింది. "నాగేష్ అంటారు లెండి. ఇంతకూ మీరేం చదువుతున్నారు?"

"పుస్తకాలే జవాబు" అంది నవ్వుతూ.

"చాలా చమత్కారంగా మాట్లాడతారే!" చూడండీ మీ యింట్లో......అంటూండగే ఓ పెద్ద వురుము వురిమి నిలిచిపోయింది. వానకూడా వెలిసింది. మెల్లమెల్లగా వీధుల్లో జనసంచారం బయల్దేరింది.

"ఇంక వెళ్తానండి!" అంటూ పుస్తకాలు చేత పట్టుకుంది సుందరి.

"అరే! అప్పుడే చీకటి పడిందే, మీరు ఒంటరిగా వెళ్లగలరా? పదండి మిమ్మల్ని నేను వదలి పెట్టి వస్తాను." అంటూ నాగేష్ లేచాడు.

(సశేషము)



# గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము



కీ॥ శే॥ డాక్టరు కే. యన్. కేసరిగారి జన్మదినోత్సవ సందర్భమున ఏప్రిలు 26-వ తేదీన కేసరికుటీరం భవనమునందు శ్రీమతి కొమ్మూరి పద్మావతీదేవిగారికి గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము జరిగెను.

ఉత్సవ సమావేశమునకు గృహలక్ష్మి మేనేజరు కుమారి కే. వసంత అధ్యక్షత వహించిరి.

ప్రార్థనానంతరము గృహలక్ష్మి సంపాదకులు శ్రీ సి. సి. పున్నయ్యగారు స్వాగతము చెప్పుచూ శ్రీమతి కొమ్మూరి పద్మావతీదేవిగారిని సభికులకు పరిచయము చేసిరి.

కేసరికుటీరం లిమిటెడు మేనేజింగ్ డైరెక్టరు శ్రీమతి కె. శారదాదేవి స్వర్ణకంకణ ప్రదానము చేసిరి.

గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీత శ్రీమతి పద్మావతీదేవిగారు తమకు జరిగిన సన్మాన సత్కారాలకు కృతజ్ఞతను తెలుపుతూ కళాసాహిత్యాలపట్ల విశేషంగా ఆసక్తిచూపి, పోషించి తాము స్థాపించి నిర్వహించిన గృహలక్ష్మి పత్రికద్వారాను, అన్యధాను మహిళాభ్యుదయాన్ని, ప్రజాహితాన్ని ప్రోత్సహించిన పూజ్యులు కేసరిగారికి కృతజ్ఞతను వెల్లడించి జోహారు లర్పించారు.

పరివారమునకు వస్త్ర ప్రదానము జరిగిన తరువాత శ్రీ సి. సి. పున్నయ్యగారు వందన సమర్పణము చేయుచు ప్రజాహితాన్ని, ముఖ్యంగా మహిళాభ్యుదయాన్ని? వృద్ధిని ప్రోత్సహించడంతోబాటు కళా సాహిత్యాలను పోషించిన పూజ్యబాబు కేసరిగారు చిరస్మరణీయులు, వందనీయులు కూడాను అన్నారు.

పూజ్యులు కేసరిగారి జన్మదినోత్సవము, గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము మరింత వైభవోపేతంగా జరుగడానికి నిధి వసతులను పెంపుచేసేలాగ డాక్టరు కేసరిగారి కుమార్తె - మాతృసంస్థ కేసరికుటీరం లిమిటెడు మేనేజింగ్ డైరెక్టరు శ్రీమతి శారదాదేవి, తదితర పరిపాలకవర్గం పూనుకోవాలని కోరారు.

నూతనంగా గృహలక్ష్మి మేనేజరుగాను, మా మాతృ సంస్థకు మేనేజింగ్ డైరెక్టరుగాను పదవుల స్వీకరించిన సోదరీమణులు కుమారి కే. వసంత, శ్రీమతి కే. శారదాదేవిగారల నభినందించారు.

ఈ ఉత్సవము జయప్రదంగా జరుగడానికి తోడ్పడినవారికి, ఉత్సవములో పాల్గొనినవారికి కృతజ్ఞతా పూర్వకమైన వందనములు సమర్పించబడినవి.

గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీత

# శ్రీమతి కొమ్మూరి పద్మావతీదేవిగారి

## జీవిత సంగ్రహము



రాజమహేంద్రవరములో 1908 సం॥ జూలై నెల 7-వ తేదీన శ్రీమతి పద్మావతీదేవిగారు జన్మించారు. ఆమె తండ్రి శ్రీ తురిమెళ్ల వెంకటసుబ్బారావుగారు. తల్లి శ్రీమతి వెంకటలక్ష్మమ్మగారు. తండ్రి 'ఆకాశవాణి' అనే వారపత్రికను నిర్వహిస్తుండేవారు. తల్లికి సంస్కృతాంధ్రములయందు ప్రవేశముకలదు. ఆమె తమ్ముడు శ్రీ కృష్ణారావుగారు ప్రస్తుతము హైదరాబాదులో 'హిందూ' ఆంగ్లదినపత్రిక ప్రతినిధిగానున్నారు.

1922లో దివాన్‌బహదూరు గుడిపాటి వెంకటరామయ్యగారి మనుమడు కొమ్మూరి వెంకటరామయ్యగారికి, పద్మావతీదేవిగారికి వివాహం జరిగింది. శ్రీ వెంకటరామయ్యగారు రజతప్రెస్‌ను నడుపుతూ 'వార్త' అనే దినపత్రికను నిర్వహించేవారు. వీరి అన్నగారే సుప్రసిద్ధకథారచయిత శ్రీ గుడిపాటి వెంకటచలంగారు.

పుట్టిల్లు, అత్తవారి యిల్లుకూడ సాహిత్యములో అభిరుచి, ప్రవేశము, అభ్యుదయభావాలకు నిలయములు కావడమువలన శ్రీమతి కొమ్మూరి పద్మావతీదేవిగారికి కళాసాహిత్యాలపట్ల అభిరుచి ఏర్పడింది.

శ్రీ తల్లావఝుల శివశంకరసాస్త్రిగారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, మొక్కపాటి నరసింహశాస్త్రిగారు, విశ్వనాథకవిరాజుగారు, పండిత తారానాథ్‌గారు, కైలాసంగారు లాంటికవులు, రచయితలు, పండితులు ఆమె కాపురంలోని వారగుటచే తరచుగా శ్రీమతి పద్మావతీదేవిగారు సాహిత్యగోష్ఠిలో పాల్గొనడాని కవకాశముండేది. క్రమంగా కళాసాహిత్యంలో అభిరుచి, అభిమానం పెరిగినవి.

శ్రీమతి పద్మావతీదేవిగారు ఆంధ్ర, కన్నడ, ఆంగ్లభాషలలో చక్కని ప్రవేశము సంపాదించారు. 1940 సం॥ బెల్గాం సమీపముననున్న సిరిసిలో కర్నాటక సాహిత్య సమావేశానికి అధ్యక్షత వహించారు.

1940 సం॥లోనే ఆమె కథారచనను ప్రారంభించారు. ఆంధ్రవారపత్రికతోబాటు క్రమంగా తెలుగు పత్రికలలో కథానికలు ప్రచురితము కాజొచ్చినవి.

శ్రీమతి పద్మావతీదేవిగారికి పత్రికా రచయితగా సయితము అనుభవముకలదు. ఆంధ్రప్రభలో 'ప్రమదావనం', ఆనందవాణిలో 'మహిళాశీర్షిక'లను, కొంతకాలం నాట్యకళ సంపాదకత్వపు బాధ్యతలను నిర్వహించారు. ఆమె కథరచనలు కొన్ని కన్నడభాషలోకి అనువదించబడినవి. ప్రసిద్ధ కన్నడ పండితులు శ్రీ తారానాథ్‌గారు, కైలాసంగారు ఆమె రచనలను ప్రశంసించి ప్రోత్సహించారు.

శ్రీమతి కొమ్మూరి పద్మావతీదేవిగారికి తెలుగు నాటకరంగంలో అనుభవము అపారము. నాట్యకళాప్రపూర్ణ బళ్లారి రాఘవాచారిగారితో ఆమె నటించిన నాటకములనేకములు. ఆమె నటనాచాతుర్యము పండిత పామరులచే విశేషంగా ప్రశంసించబడినది.

ఆమె కళాపిపాస, ఆరాధన ఆదర్శనీయమైనవి. ఆమె ప్రజ్ఞా విశేషాలకు ఆంధ్రదేశము గర్వపడవలసి యున్నది.

ఆమె చక్కని వాగ్ధోరణికలదగుటచే మద్రాసు ఆలిండియా రేడియోలో మహిళా, పిల్లల కార్యక్రమాలను అనాదినుండి నిర్వహిస్తున్నది.

మహాత్మా గాంధీ జీవితం 'డాక్యుమెంటరీ' చిత్రానికి తెలుగు కామెంటరీ చెప్పారు.

1942 సం॥ వార్ ఫ్రంట్ తరఫున కృష్ణాజిల్లాలో యుద్ధ ప్రచార ఉపన్యాసాలు యిచ్చారు.

పిఠాపురం మహారాజావారి షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున కవయిత్రులతో బాటు శ్రీమతి పద్మావతీదేవిగారిని సువర్ణ రజతాలతో సత్కరించి సన్మానించారు.

శ్రీమతి పద్మావతీదేవిగారు రచించిన 'పొగడదండ' అనే కథల సంపుటిని యువవారు ప్రచురించారు. దేశకవితా మండలివారు 'కథాసాగరం' అనే కథల సంపుటిని ప్రచురించనున్నారు.

ఆమెకు ముగ్గురు ఆడపిల్లలు, ఒక కుమారుడు. సుప్రసిద్ధ నవలారచయిత కొడవటిగంటి కుటుంబరావుగారి భార్యయీమె పెద్ద కుమార్తె-శ్రీమతి వరూధిని.

పత్రికా రచయితగా పేరుగాంచిన శ్రీ కొమ్మూరి సాంబశివరావుగారు ఏకైక పుత్రులు.

కుమారి తారాదేవి, ఉషాదేవి చిన్న కుమార్తెలు.

విద్యా విజ్ఞానాలకు, కళాసాహిత్యాలకు నిలయమైన శ్రీమతి పద్మావతీదేవిగారి కుటుంబం కలకాలం వర్ధిల్లి కళాసాహిత్య రంగాలలో విశేషంగా సేవచేయాలని మా ఆశ.



# గీతావాణి

యం. వి. ఆర్ కృష్ణశర్మ

ఆత్మచేఁదన్ను రక్షణ మాచరించు
కొనవలయును, నధోగతి మునుఁగఁగూడ,
దాత్మయే తనకును, హితుండగుచునుండు;
నతఁడె పరమ విరోధియై యలరుచుండు.

♦ ♦ ♦

ఎవరు నాత్మ నిగ్రహము వహింపఁగలరో?
వారికిని వారి యాత్మయే బంధువగును;
నాత్మ నిగ్రహము వదలినట్టివారి,
కాత్మయే ఘోర శత్రువ యట్టులుండు.

♦ ♦ ♦

అర్జున! యెవఁడు సర్వంబునందు నెపుడు
సుఖము దుఃఖములందు, నశుద్ధ చిత్తుఁ
డగుచు, సమబుద్ధి వడయునో? యట్టివాఁడు
యశముగాంచు; నత్యుత్తముఁడంచువసుధ

♦ ♦ ♦

అర్జున! మనసు చంచలంబగుట నిజము
దానిని గ్రహింపంగను దరముగాదు;
దానిన భ్యాసమువలన నైనఁ గాని,
పరమ వైరాగ్యమునఁగాని వడయువచ్చు.

♦ ♦ ♦

యోగి నాత్మాను సంధాను శూన్యుఁడైన
వాఁడు, యోగమెప్పుడయినఁ బడయలేఁడు;
వడయుచుండు, నుపాయంబువలన, నెవ్వఁ
డాత్మవశుఁడయి యుండునో? యట్టివాఁడుఁ

"భగవద్గీత" నుండి.

# బదులుకు బదులు

శ్రీమతి మునిపల్లె సరస్వతి

సుందరం మిలటరీకి వెళ్లినప్పటినుండియూ కాంతమ్మ విచారంతో మంచమెక్కింది. పొరుగింటి పున్నమ్మ, ఇరుగింటి వీరమ్మ పోగై చెప్పవలసిన మాటలన్నీ చెప్పారు. కాని కాంతమ్మ హృదయం తేలికపడిందికాదు. కాంతమ్మ కన్నులలో కొడుకు సుందర విగ్రహం కొట్టొచ్చినట్టు కన్పిస్తూండేది. దానితో కాంతమ్మ భోరునఏడ్చి, జారిన వెంట్రుకలను విదిల్చి ముడుచుకొని కుక్కిమంచంలో కూరుకుపోయేది. సుందరం మాటలు కాంతమ్మను అంధకారంలోకి లాక్కుపోయాయి. కాంతమ్మ పెనిమిటి నాగయ్య కొడుకు మిలటరీకి వెళ్లిన నాలుగు రాళ్లు తేగలడనే వాంఛతో కాంతమ్మను వూరడించేవాడు. కాని కాంతమ్మ నాగయ్య మాటలను నిర్లక్ష్యపెట్టడం మొదలెట్టింది. దానితో నాగయ్యకు కాంతమ్మమీద విసుగుకల్గింది. ఇంట్లో పిల్లా పీచూ వొకటేఏడుపు తిండికోసం - కాంతమ్మ మంచంమీదనుండి కాలుదింపదు. నాగయ్య పిల్లలతో వంటదగ్గర నానా యిబ్బందులు పడుతున్నాడు. ఇరుగు పొరుగు పలికేట్టులేరు.

◆ ◆ ◆

## 2

కాంతమ్మకు కొడుకు మిలటరీకి వెళ్ళాడన్న దిగులు వొకవంతయితే, మంచి సంబంధం అయిన తన తమ్ముడు తన కూతుర్ని చేసుకోలేదని అదో దిగులు. ఈ దిగుళ్ళతో కాంతమ్మ హృదయం దవానలంలా దహిస్తోంది.

ఎవరికైనా సరే యీడొచ్చినపిల్ల యింటబడి వుంటే - నాకేమిటి ? ... కాంతమ్మకేమిటి ? ... మరొకరికేమిటి ? ... చుట్టుపక్కలవారు "కానీయండి, కానీయండీ ! మంచి ముహూర్తాలు వస్తూంటే ... " అని అంటూంటారు. అలాగే కాంతమ్మ తన కూతురు సుబ్బలక్ష్మి యింటబడి వుంటే ఎంత దిగులు ! ! పాపం ... కాంతమ్మ అమాయకురాలు. కనుకనే తన తమ్మునకు బి. ఏ. చెప్పించుకొని, చివరకు తన కూతుర్ని యిచ్చుకోలేకపోయింది. ఇన్ని కష్టదశల్లో కాంతమ్మ మంచం పట్టకుండా ఎలా వుంటుంది ? సుందరం మిలటరీకి వెళ్ళడం, తన తమ్ముడు తొలగిపోవడం ఒకేసారి జరిగాయి. తన కండ్లను తానే నమ్మలేకపోయింది కాంతమ్మ. లోకపు పోకడలు కాంతమ్మకు అప్పుడర్థమయ్యాయి.

◆ ◆ ◆

## 3

శ్రీనివాస్ కాంతమ్మకు సోదరుడు. నవయవ్వన నాగరీకుడు. బి. ఏ. పట్టా పుచ్చుకున్నవాడు. చిన్నతనమునుండి కాంతమ్మ దగ్గరే పెరిగి అక్కగారి ప్రోద్బలమువల్లనే బి. ఏ. చదివాడు శ్రీని. అక్కగారింట్లో వుండికూడా, అక్క కూతురిపైన అనురాగాన్ని పెంపొందించుకోలేకపోయాడు. ఆమె అతనికి సహజ సోదరిప్రేమ మూర్తీభవించింది. దానితో కథ అడ్డం తిరిగింది. లోకానికి శ్రీని నిందితుడుగా వ్రేలెట్టి చూపబడ్డాడు. నలుగురు నానా మాటలు మాట్లాడారు. శ్రీని బావగారింట్లోవుంటే మర్యాద దక్కదనుకున్నాడు. ప్రక్కనున్న మేనమామగారింట్లోకి దారి తీశాడు. వూరివారంతా నివ్వెరపడ్డారు. కష్టపడి చదివించిన కాంతమ్మ నాగయ్యలకు ఫలితం దక్కలేదు. 'పాపం కష్టపడినా కొందరికి ఫలితం దక్కదమ్మా !' అని వచ్చిపోయేవారు అంటుంటే కాంతమ్మ ముఖం పాలిపోయినట్లయింది. తనకు అండ ఎవరు ? బంధువులంతా తన కాపురాన్ని వేరుచేశారు. ఆడపిల్లకు మనువులు రానీయకుండా యీ విహంగాలు శాఖశాఖకూ వ్యాపించివున్నాయి, దీక్షతో యోచిస్తే కాంతమ్మ కొక్కక్కసారి నిద్రే వచ్చేదికాదు. ఆవలింతల్లో మినుక్కు మినుక్కుమనే దీపపు ప్రమిదను చూస్తో కునికిపాట్లు తీస్తుండేది.

నాగయ్య పేరుకు తగినవాడు. తన భార్య, కూతురు వివాహానికై దిగులుపడుతుంటే చూచి సహించగలడా? ... పొరుగువారు చేసిన పనికి ప్రతీకారం చేయాలని మనసులో పందెం వేసుకున్నాడు. తన యిష్టదేవత పుట్టలమ్మను అనేక విధాల ధ్యానించాడు. తన యావదాస్తి పదెకరాలలోనూ, రెండెకరాలు వరునకు కట్నంగానిచ్చేలా భార్యకు నచ్చచెప్పాడు. ఇంతటితో కాంతమ్మ కొంచెం మంచం మీది కాలు క్రిందకు పెట్టడం మొదలెట్టింది - పాలిపోయిన ఆమె చెక్కిళ్లు మళ్ళీ చిగిర్చాయి. కాంతమ్మ యింటికి రకరకముల పెండ్లికొడుకులు వస్తున్నారు పోతున్నారు. కాని మాయ గ్రద్దల చేతుల్లో చిక్కేవారు జారిపోతూనేవున్నారు. పోతున్నారే అని, కాంతమ్మ కించిత్తయినా దుఃఖపడలేదు. అమాయకురాలగు కాంతమ్మ భర్త యిచ్చిన హామీమీద ధైర్యపడింది. దానితో కొడుకుమీది బెంగ కొంచెం సన్నగిలింది. నాగయ్య తన స్నేహితులద్వారా మంచి కుఱ్ఱవానిని, తమ కులస్థుడైన మోతుబరీ రైతు కుమారుణ్ణి పట్టాడు. నాగయ్య వుదయాన్నే కోర్టు వ్యవహారమున్నదని బయట పుకారు పుట్టించాడు. భార్య కట్టిన చద్దిని చంకన బెట్టుకొని ప్రయాణమయ్యాడు. మునిముని నవ్వులతో కాంతమ్మ నాగయ్యకు వీడ్కోలిచ్చింది - కాంతమ్మ నాగయ్య 'పండు' చేసుకువస్తాడని వేయి దేవతలకు మొక్కుకుంటుంది - తల్లి అష్టకష్టాలు చూచి సుబ్బులు దొడ్లోని తులశమ్మకు దొంగ నమస్కృతులు అర్పిస్తోంది.

◆ ◆ ◆

## 4

మహాత్ములు తమ కార్యములను భగవంతునిపై భారము వేసి చేస్తారు. అలాగే నాగయ్య భగవంతుని ధ్యానిస్తూనే వరుణ్ణి ఖాయపర్చుకున్నాడు. ఆ వూరిలో ఆ కుఱ్ఱవాడొక్కడే చక్కగా చదివినవాడు, సంపన్నుడు. నాగయ్యకు ఎక్కడలేని సంతోషంగలిగింది. ఎగిరిగంతు వేసి, కాంతమ్మకీ వార్త ఎరిగిద్దామా! ... అని అనిపించింది. కాని అది నాగయ్యకు సాధ్యమనిపించలా ... నాగయ్య చాటుమాటునా లొట్టలు కొట్టుకుంటూ తను యివ్వదలచుకొన్న కట్నాన్ని మాటల సందర్భంలో విడిచాడు. వరుడు నాలుక కొరుక్కున్నాడు. పిల్లను చూడాలన్నాడు. - నాగయ్య తల వూపాడు - మరునాటి సాయంత్రమే నాగయ్య పెండ్లి పెద్దలతో యింటికి మరలి వచ్చాడు. జడకుప్పెలు, చక్కని జార్జెట్ పరికిణీ, ఆకుపచ్చ పూల దావిణీ, చెవులకు లోలకులు గాలికి తేలిపోతున్నాయి. ఒక్క చిటికెలో వాకిట్లోకి వచ్చింది పుత్తడి బొమ్మలా సుబ్బులు.

నాగయ్య చిటికవేసి సుబ్బులికి సైగచేశాడు. సుబ్బులు తండ్రిగారి సౌజ్ఞను పంజరంలోని చిలుకలా గ్రహించి తుర్రున తలుపుచాటుకు తొలగిపోయింది. నాగయ్య అసాధ్యుడమ్మా అని కేకవేసింది శేషమ్మ. దానితో నలుగు రక్కలూ తోడు దొంగల్లా అందెలు మోదుకుంటూ పంచలోకి దారితీశారు. నాగయ్య మొహం చిటచిటలాడిపోతున్నది. పెండ్లివారేమనుకుంటారో అయ్యగారి ముఖంచూచి అని కాంతమ్మ మాటలు సాగదీసి, సాగదీసి మాట్లాడ్డం మొదలెట్టింది. వరుడు పిల్లను జూచి నవ్వుకున్నాడు. అందరి కండ్లలో కారం దుమ్మెత్తిపోసినట్లు అయింది - ఒకరి మొహం వొకరు చూచుకోడం జరిగింది - పెండ్లికొడుకు నోటివెంటవచ్చిన మాటలు వినగానే కాంతమ్మ కడుపు చల్లబడింది - తన తమ్మునిమీద ఇప్పుడొక విధమైన క్రోధము ఏర్పడింది - తన తమ్మునికంటే యీ కుఱ్ఱవాడు వందరెట్లు అందంగా వున్నాడని గర్వించింది. చదువులోను తీసిపోడు. కాంతమ్మ ముఖం కళకళలాడింది. పెండ్లివారంతా వెంటనే ఆకు వక్కలు తీసుకొని యిండ్లకు జేరారు. కాంతమ్మ పొరుగిండ్లకు వెళ్లడం మానివేసింది. ఇక మిగిలింది తన కొడుకు విషయం - కూతురు పెండ్లి ప్రయత్నం జోరుగా జరిగిపోతుంది - కాని పచ్చని పందిరిలో తన ముద్దుల కొడుకు సుందరంవుంటే ఎంత అందంగావుండు ననిపించింది కాంతమ్మకు. ఇల్లాండ్ర కోరికలకు అంతూ

పొంతూవుండదట! అలాగే కాంతమ్మకొడుకు సుందరంవున్నా - మనుమళ్లకొరకు వెదకేదా హృదయం.

నాగయ్యతో పన్నాగం ప్రారంభించింది. అప్పటికే సుందరం మిలటరీకి వెళ్ళి రెండేళ్ళయింది. "తనకు ప్రమాదావస్థగానున్నదనియు, ఆఖరిచూపులందవలెనని, త్వరగా బయల్దేరిరావలయునని తెగించి కాంతమ్మ తంతిగొట్టమంది. నాగయ్య బుర్రతిప్పి నూరు రూపాయిలకాగితం మార్చుకొని గిర్రున జేరాడు రైలుస్టేషన్కు - తంతిగొట్టగానే సుందరం శరీరంగగుర్పొడిచింది. మాతృదేవత కారుణ్యం అతనిలో తొంగిచూచింది. కండ్లు చెమ్మగిల్లాయి, అతనిలోని ప్రతినరం మూల్గింది. నాలుగడుగుల్లో-కమాండరును కలుసుకున్నాడు. సుందరం అదృష్టవశాత్తు ఆయన 'డిస్ఛార్జి' అని నొక్కి చెప్పి, 10 పదుల కాగితాలు చేతిలోపెట్టి షేక్‌హాండ్ యిచ్చి వీడ్కోలిచ్చాడు - సుందర తిరిగి వుదయాన్నే గుఱ్ఱం బండిలో స్టేషన్నుండి యింటికి పరుగెత్తాడు, ఇంటికి సున్నం - యింటి ముందు పెద్దపందిరి. తల్లిదండ్రి చేసిన పన్నాగం చాల బావుందనుకున్నాడు.

"ఇంతకూ ఎవరిపెండ్లి?" సుందరాన్ని మరి మరీ బాధించసాగింది. అడుగుదీసి అడుగెట్టగానే తల్లి దిష్టి తీయడానికి పళ్ళెంతో హాజరయింది. తల్లి కాంతమ్మ - సుందరం వొళ్లు పులకరించింది. బి. ఏ. తప్పిపోయిన సుందరం బంధువుల మొహం చూడాలంటే సిగ్గుగానేవుంది. కాని మిలటరీధీమాను వెలిగించాడు సుందరం -

♦ ♦ ♦

5

అనుకున్న ప్రకారం సుబ్బులక్ష్మికి శ్యామబాబుకు వివాహం అద్భుతంగా జరిగింది. మంచి మంచి లాంఛనాలతో నాగయ్య జరిపాడు కూతురి పెళ్లి. శ్రీనివాస్ మొహం నల్లబడింది. నాగయ్య అస్త్రానికి కాంతమ్మ శాంతానికి ఇరుగుపొరుగు వాళ్ళు ఏమిచేస్తారు? అదంతా దైవ మహిమ - దిక్కులేని వారికి దేవుడేదిక్కు.

శ్రీనివాసన్ పది సంవత్సరములు తహశీల్దార్ పనిచేసి, మంచి లాభంతీసి మేడకట్టాడు. శ్రీనికూతురు నళిని యస్.యస్.యల్.సి పరీక్ష వ్రాసి వచ్చింది. నళిని చిన్ననాటనే సుందరాన్ని అదోలా మాట్లాడించేది. కాని సుందరం నళినిమీద ఆశ పెట్టుకోలేదు. వాళ్ళకు వీళ్ళకు మాటలులేకపోగా నళిని వల్లకూడా మాటలు కలిసేలా లేవు. సంవత్సరం గడిచింది. నళిని పరీక్ష పాసయింది. తల్లి రత్తమ్మ గయ్యాళి. శ్రీని రత్తమ్మతో పిల్లిలా కాపురం చేస్తున్నాడు. నళిని తల్లిమాటలకు అడుగులకు మడుగులొత్తుతుంది. అందువలన నళిని, తల్లి ఊహలకు బలియయింది, సుందరం అంటే రత్తమ్మకు, ఒక విధమైన క్రోధం. దానిచే రత్తమ్మ సుందరానికి తన కూతుర్ని యివ్వగూడదనుకుంది. తన మాటమీద వుండేవాడు భర్త. నళినిని వేరొక కుఱ్ఱవానికి యిచ్చుకోజూచింది. పిల్లికంచంలో పాలు త్రాగుతూ ఎవరికీ తెలియదనుకుంటుంది, అలాగే రత్తమ్మ కూతురు నళినిచేత తనవైపు చుట్టానికి వుత్తరం వ్రాయించింది.

ఎలాగయితేనేం ఆనోటా నోటా సుందరానికి తెలిసింది. తన మేనమామ ద్రోహం, సుకందరానికి వెర్రిగా ఏడుపువచ్చింది. కాని తన తల్లివలెనే శాంతం వహించాడు. నలుగురూనవ్వారు. కాని సుందరం అధైర్యపడలేదు. యింటికికూడాపోలేదు. ముందు నళిని వివాహమయితే గాని తాను వివాహం చేసుకోనన్నాడు. మూడు నెలలు గడిచాయి. నళిని తల్లిదండ్రులు సుందరం దగ్గరకు రాలేదు. నళినికి వివాహం నిశ్చయంజరిగింది. సుందరం ముఖం వికలమయింది. కాంతమ్మ గుండెలో రాయబడ్డట్టు అయింది. నాగయ్య నాగుబాములా బుసపెట్ట సాగాడు.

♦ ♦ ♦

6

ఆరోజు టెలిగ్రామ్ వచ్చింది. మంచంమీద నున్న సుందరం వులిక్కిపడేలా పోస్టుమేన్ కాగి

తాన్ని చేతికందించాడు. ఏముంది...“శుభవార్త!” గొప్పింటి పడుచు తనకు యిల్లాలు కాబోతోంది. ఎందరో వారి పడుచుల్ని చేసుకోవాలని ప్రయత్నం చేశారు. కాని వారికి లభించలేదు. ప్రయత్నించిన వారిలోని వారే శ్రీనివాసన్, తన బావశ్యాబాబు.

అదృష్టం! ఎవరిదంటు? సుందరం ఎగిరిగంతు వేసి అమ్మకు ఎదురయ్యాడు - కాంతమ్మ గంపెడు దుఃఖంతో నిండింది. శెలిగ్రామనగా, వారి ... సంబంధం అనగానే కాంతమ్మ శరీరం సంతోషంతో పులకరించింది. 8 వేలరూపాయల కట్నంతో సుందరం గొప్పింటి బిడ్డను అందుకో బోతున్నాడు.

హుం...“బదులుకు బదులు” సుందరం ఆకు వక్కలతో, పట్టుబట్టలతో గొప్పింటి పడుచును, అందుకున్నాడు. సుందరం తన మర్యాదను కాపాడుకొని మామతో బదులుకు బదులు తీర్చుకున్నాడూ,

—o—

# సి రి సి రి మువ్వ లు

ఉపాధ్యాయుడు:-బాబ్జీ! ఏనుగులు ఎక్కడ దొరుకుతవిరా?

బాబ్జీ:-(కొద్దిగా ఆలోచించి) ఏనుగులాంటి పెద్ద జంతువులను ఎవరు పారేసుకుంటారండీ! ఎక్కడైనా దొరకడానికి!

ఆల్లంకి చెల్లారాం

♦ ♦ ♦

ఒక సభలో బ్రాహ్మణులకు తాంబూలాలు పంచిపెడుతుంటారు. ఒక కుర్రాడు తన తండ్రితో “నాన్నా! అరటిపండు నాకే - అర్ధణా నాకే - వక్కలు మాత్రం నీవు తీసికో” అన్నాడు.

“అమ్మకోమరి?” అన్నాడు బ్రాహ్మణుడు.

“విడాకులిచ్చేయ్” అన్నాడు కుర్రాడు తమలపాకులు చూపుతూ.

♦ ♦ ♦

“మీ కుక్క బాగుంది”

“చాల మంచిదండి - ఏమి పెట్టినా తింటుంది - పిల్లలంటే బలే యిష్టం”

“ఓరి బాబోయ్! - పిల్లలను తినే కుక్క ఏంమంచిదీ!”

♦ ♦ ♦

“ఏమిరా నాయనా! పంతులుకు ప్రైవేటు జీతం మాత్రం చెల్లించడమేకాని ఆయన దగ్గరకు వెళ్లి చదువుకోపోతే ఏలాగ?”

“వెళ్తాను - యిప్పుడే ఏంతొందర! పరీక్షలయిన తర్వాత ...”

♦ ♦ ♦

“అమ్మాయ్! తర్వాత సీనులో నీవు సత్యవంతునిమీదపడి ఏడవాలి” అన్నాడు ఒక సినిమా డైరెక్టరు.

“ఎలాగండీ!” అన్నది నాయకి.

“మీ ఆయన పోయినప్పుడెపుడూ ఏడవలేదూ?”

“లేదు - మరొకర్ని చేసికున్నాను” అని తార సమాధానమిచ్చింది.

పిల్లా సుబ్బారావుశాస్త్రి

# చిన్నమ్మ కథ

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

## శైలి

చిన్నమ్మ కథలోని భాష ప్రజాభాష. పాండిత్యానికి దీనికి సంబంధంలేదు. పాండిత్యం అవసరమేలేదు. శూద్రజనుల వాడుకొనే భాష పుష్కలంగా కనబడుతుంది. పట్టి పాతపురాణం మాటలు అంతగా కనబడవు.

## వచనం

ఈ పుస్తకంలో పద్యం, వచనం సమానంగా ఉన్నాయి. అంత అధికంగా వచనమున్నా అదొక లోపంగా కనబడదు. బాలనాగమ్మ కథలోనూ వచనం విస్తారమే. బంగారు తిమ్మరాజు వంటి కొన్ని కథలలో వచనము చాలమితంగా ఉంది.

చిన్నమ్మకథలోని వచనం పూర్వం చెప్పిన కథ యొక్క సారాంశంకాదు. వచనంలోకూడ కథ కొనసాగిపోతూంటుంది. కాబట్టి వచనాన్ని తీసివేస్తే కథ అసంపూర్ణమవుతుంది. ఈ రకంగానే కాంభోజరాజు, బంగారుతిమ్మరాజు. బాలనాగమ్మ కథలు రచించబడ్డాయి.

## జాతీయాలు మాటలు

ఈ జంగంకథలో అనేక జాతీయాలు కనబడతాయి - మెడబట్టి నెట్టుట, శూన్యతిథి ఉగాది ఎండకాలం, చిగురువంటి గడ్డి, మణమలు తొక్కబాగు రావడం, జానమూకుడు. కొండ పాటి కోనేరు కొల్లాపురి బుట్ట, నిమ్మపండువంటి దేహం, నడిపిరెడ్డి, హంసలగద్దెపీట, హంసల బండి, కంచు బోరు తలుపులు, తోడు బోతులు. గద్దె, ఎరుకల నాంచారి. కోలారి బండి, బెరికి గానుండుట, ముక్కిడి లేవుట, మేనా, వడి బత్తెం, నగారానేపుబత్తులు, డేరా, ముడి రేకు, గుండలే లేకిముండ, బోనకత్తె, గులాపుతొత్తు మొదలైనవి.

అచ్చు పుస్తకమంతా తప్పులకుప్ప. పరిశుద్ధప్రతిని వేయించవలసిన బాధ్యత వాఙ్మయ సేవకుల మీద ఉంది.

పాత్రుడు గారి
బాలసంజీవిని (Regd)
పిల్లల లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులను నివారించును
డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు అండ్ బ్రదర్స్,
19, దక్షిణ మాడవీధి, మైలాపూరు, మదరాసు-4. Phone 71354
కుంభకోణము బ్రాంచి : 1. సారంగపాణి కోవిల, తూర్పువీధి.
అన్ని మందుల షాపులలోను దొరకును.




## ఉపాయముంటే!

శ్రీ పిల్లా సుబ్బారావు శాస్త్రి

ఒక్కసారొక
పాములవాడొక
పామునుబట్టి
బుట్టలోబెట్టి
పాముకుమేతగ
పట్టెనొక ఎలు
కను, వేసెను దా
నిని బుట్టలోను.

పామునుజూచి
పలికెను బెదురుచు
ఎలుక యిటుల దీ
నముగా పాపం!
"ఆగుము రాజా!
ఆగుము! నాదు
పలుకుల వినుము
పిమ్మట తినుము!
పాపం! నీవు
పడితివి చేతిలో,
నరుడు వీడు వ
దలడు నిన్నసలు!

నిన్నునే విడిచెద
నన్ను విడువాలి మ
రి నువ్వు, కలుగును యి
రువురికి లాభం!"

పాము దీనికి
పాపము నమ్మ
తించె వేరే గ
తి లేదనెరిగి!

ఎలుక బుట్టకు
కలుగుచేయ
పాము పడగ నె
క్కి యుక్తిగను.
బుట్ట బొక్క
బెట్టి పారెన్
ప్రాణాలతో
పామును వొదలి!

బరువు తగ్గదల
పైనయేల
యని పైకిజూచె
పాము వెఱ్ఱిగ!

పైన నగలదు కలుగు
పారిపోయె నె
ప్పుడో ఎలుక చ
ప్పుడు లేక నే!

పాము బయటను
పడి సంతసించె
బ్రతికి బయట ప
డితి ననుచు తనలో!

ఉపాయమున్న
అపాయమెంత
ఒప్పుకుంటావ
నేడు బాలా!

---

# విజయ-భారతి

(గత సంచిక తరువాయి)

కాని కుమారుని మనోభీష్టము నెరవేరకపోతే దిగులుతో కృశించి పోతాడేమో అని బాధపడ్డారు. చివరకు విధిలేక అంగీకరించారు. మకరంద్ ఎంతో ఆనందంతో తల్లిదండ్రుల పాదాలను తాకి కావలసిన ధనము తీసుకొని బయలుదేరాడు.

ఊళ్లూ ఎడారులూ అడవులూ దాటి వెళ్లిపోతున్నాడు. ఇలా ఒక అరణ్యంలో పడిపోతుండగా ఒక ముని ఆశ్రమం అగుపించింది. వెంటనే మకరంద్ ఆశ్రమంలోనికి వెళ్లి మునికి నమస్కరించాడు. ముని వచ్చిన పనేమిటని అడిగాడు. వెంటనే మకరంద్ చేతులు జోడించి "స్వామీ! తమవద్ద నూతన విద్యలనేమయినా నభ్యసించవలెననివచ్చాను. నా కోరిక మన్నించగలరని వేడుకుంటున్నా" నన్నాడు.

ముని చిరునవ్వునవ్వి సరేనన్నాడు. రోజులు గడిచిపోతున్నాయ్ కాని ముని ఒక్క అక్షరం ముక్కకూడా మకరంద్‌కు చెప్పటంలేదు. పైగా తనచేత ప్రతిసాయంత్రము పూలదండ కట్టించుకొని ఎక్కడికో పోయేవాడు. సాయంత్రమయ్యేసరికి మాడు మొహంతో వచ్చి అకారణంగా మకరంద్‌ను చివాట్లు పెట్టేవాడు. మకరంద్‌కు యీ విషయం భరింపరానిదిగా వుంది. వీడు బహుశా దొంగ మునియైయుండవచ్చును. రహస్యమేమిటో తెలుసుకొనవలెనని నిశ్చయించుకున్నాడు.

2

ఆ సాయంత్రం ఎప్పటి మాదిరిగా మాల కట్టించుకుని బయలుదేరాడు. మకరంద్ కూడా మునికి కనపడకుండా నక్కుతూ, చెట్లచాటున దాక్కుంటూ మునిని సంకేతంగా వెంబడించాడు. ముని నెమ్మదిగా ఒక కొండ దగ్గరకు వచ్చాడు. ఆ కొండలో ఒక గుహవుంది. ఆగుహలో నడక సాగించాడు.

ఇంకా పోయేసరికి ఒక పెద్ద గుహ తగిలింది. చూడటానికి గుహమాదిరిగా వున్నప్పటికీ భవనం మాదిరిగా తొలచబడివుంది. ముని ఒకతలుపు తోసుకునిలోపలకు వెళ్లాడు. అక్కడ ఒక స్త్రీ గడగడలాడుతూ కూర్చుంది. మునిరాగానే వణుకుతూ లేచింది.

"ఏమంటావ్ నన్ను పెళ్లి చేసుకుంటావా"-అని అడిగాడు గర్జిస్తూ.

"ఛీ! యిక్కడనుంచి వెళ్లిపో. నీకు బుద్ధిలేదూ. పరాయి ఆడదాన్నిఎత్తుకొచ్చి బలాత్కరించటం తగిన పనేనా? నన్ను విడువు. నీకు పుణ్యముంటుంది." అనిఏడిచింది. మునివెంటనే రాక్షసుడుగా మారాడు. పూల దండ ఆమెవైపు విసిరాడు. ఆమె

ఆ దండను నేలతో రాని - నా బొందిలో జీవంవుండగా నీమాట అంగీకరించనూ, పిశాచపు వెధవా, వెళ్లిపో - అని యిష్టంవచ్చినట్లు తిట్టింది. రాక్షసుడు మండిపోయాడు. "సరే - యీ రోజుమాత్రమె నీకు గడువిస్తున్నా. ఒప్పుకుంటే సరేసరి, లేకబోతే బలాత్కారంగానైనా.." అని గర్జిస్తూ రాక్షస రూపంవదిలి మునిరూపంతో చరచరా బయటకు నడిచాడు. ఆ అమ్మాయి మూర్ఛ పడిపోయింది. మునికంటె ముందుగానే మకరంద్ వుడాయించి దుప్పటి ముసుగు పెట్టాడు.

ఆ రాత్రి మకరంద్‌కు నిద్రపట్టలేదు. వీడు రాక్షసుడన్నమాట! ఎంత మోసంజరిగింది. పాపం! ఏదేశపు అమ్మాయో. ఆమెను బలాత్కరిస్తున్నాడు. దొంగ వెధవ ఎలాగయినా వీడిని చంపి ఆ అమ్మాయిని రక్షించాలి. అని నిశ్చయించుకున్నాడు. ముని గాఢంగా నిద్రపోతున్న సమయంలో లేచి గప్‌చిప్‌గా గుహను చేరుకున్నాడు. మకరంద్ ఆమె దగ్గరకు రాగానే భయపడుతూ లేచింది. - "నన్ను విడిచి పెట్టండి. పుణ్యముంటుంది. ఎందుకు యిన్ని రూపాలతో నన్ను బాధిస్తారు"? - అని వేడుకుంది.

మకరంద్ చిరునవ్వునవ్వి భయంలేదని ఓదార్చి తననిజవిషయం చెప్పాడు. వెంటనే ఆమె సంతోషించటానికి బదులు కంగారు పడింది - "ఈ ప్రదేశం రక్కసులకు ఆలవాలమని మీకు తెలుసు, తెలిసివుంటే ఒక్క అబలకోసం ఎందుకు మీ ప్రాణాల మీదకు తెచ్చుకుంటారు" అంది.

"నాకు ఆపద దాపురించినా సరే, యీ నరకం నుండి రక్షించటమే నావిధి. నా ప్రాణంమీద నాకు ఎంత తీపివుందో, నీకుకూడా నీ ప్రాణం విషయంలో అంతేకదా. ఎదుటి ప్రాణాలను కష్టాలలోనుండి కాపాడుటమే" నా విధి అన్నాడు.

ఆమె మాట్లాడలేదు.

"అది సరేకాని నీ పేరేమిటి? నీవిలా రావటానికి గల కారణమేమిటి" అని అడిగాడు.

ఆమె విచారవదనంతో తన కథ యిలా చెప్పసాగింది. "మాది ఆనంద రాజ్యము. నా తండ్రి సమరసేనుడు. తల్లి శీలవతి. నేను వారికి రెండవ కుమార్తెను. మా అక్కయ్య తరువాత చాలా కాలానికి నేను కల్గుటచే ఎంతో ముద్దుగా చూచేవారు. క్రమంగా నేను పెరిగి పెద్దదాన్నయాను. ఇలా వుండగా ఒకనాడు ఒకముని మా ఆస్థానానికి వచ్చాడు. తనకు సర్వవిద్యలూ వచ్చునన్నాడు. మా కొలువులో ఏదయినా చిన్న వుద్యోగమిప్పించమన్నాడు. మా నాన్న సరేనని నాకు చదువు చెప్పుటకు నియోగించారు. పాపం! నా తల్లిదండ్రులకు ఏమి తెలుసు? నిజమైన, మునే అనుకొని ఆదరించారు. ఇలా రోజులు దొర్లిపోతున్నాయ్. ఎప్పటి మాదిరిగా పుస్తకాలు తీసుకొని విద్యాగృహంలోనికి వచ్చాను. ఇంతలో మునికూడా వచ్చాడు. అప్పుడు ఆ సమయంలో అక్కడ నేనూ గురువుగారు తప్ప ఎవ్వరూ లేరు. కాని ఇంతలో ముని భయంకరమైన రాక్షసుడుగా మారాడు. నేను అవికృత రూపాన్ని చూచి మూర్ఛ చెందాను. కళ్లుతెరచి చూచేసరికి యీ గుహలో బంధింపబడ్డాను. రోజూ తనను పెళ్లాడమని బెదిరించటం నేను తిరస్కరించటం జరుగుతుంది. ఇంతలో మీరు దేవుడులాగా వచ్చారు." అని ముగించింది.

రాజకుమారి కథ సాంతం విన్నతర్వాత ఒక్క నిట్టూర్పు విడిచాడు. "అయితే యింతకథా చెప్పి నీపేరు చెప్పలేదేం?" అన్నాడు నవ్వుతూ. "విజయబాల" అంది సిగ్గుతో.

'ఇదిగో విజయా ఒక్క పనిచెయ్యి. ఎలాగో వాడిని మధ్య పెట్టి మాయచేసి ప్రాణరహస్యంకనుక్కో. ఆ తరువాత కార్యక్రమం నేను చూస్తా' నన్నాడు. విజయబాల సరేనంది.

ఆ సాయంత్రం ముని ఎప్పటిలాగా దండపుచ్చుకు వచ్చాడు. ఈ సారి విజయబాల నవ్వుతూ స్వాగతమిచ్చింది. రాక్షసుడు వుబ్బిపోయాడు. ఇదిగో

(274 పేజి చూడుడు)

# సుజాత

విద్వాన్ శ్రీమతి శ్రీపాద సుజాత బి. ఏ.

[ముఖ్యముగా సాహిత్యవ్యాసంగమున్నది మూడు విధములు:- సృజన, విమర్శన, పరిశోధన. ఈ త్రివిధవ్యాసంగములందును త్రివిక్రములైన వాఙ్మయ ధురంధరులరుదుగా నుందురు. అట్టివారిలో డాక్టరు శ్రీ కాకర్ల వెంకటరామ నరసింహముగారొకరు. ప్రకృతము వీరాంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర భాషా శాఖాధ్యక్షులు. ఎమ్. ఏ., పిహెచ్. డి. పట్టభద్రులు. సహృదయులు, సమర్థ పరిశోధకులు, విదగ్ధవిమర్శకులు, కవులు నవలాకర్తలు, గేయ ప్రబంధ కథానికా నాటికాది బహుప్రక్రియా దక్షులునైన సాహిత్యస్రష్టలు వీరు. ఆంధ్ర ప్రబంధములు, దక్షిణదేశయాంధ్ర వాఙ్మయము, శ్రీనాథుని సాహిత్యము మొదలగు ననేక విషయములగూర్చి మహత్తర పరిశోధనలు జరిపి ఉత్తమ వ్యాసములనేకము పత్రికాముఖమున ప్రకటించి యున్నారు. ఇటీవల తంజావూరు నాయకరాజ వాఙ్మయము గూర్చి యొక చక్కని గ్రంథము వెలయించిరి. ఇంకను వారి పరిశోధన ఫలములు గ్రంథ రూపమున లోకప్రకాశితములు గావలసి యున్నది. వాఙ్మయ విమర్శ పరిశోధన పఠనపాఠనవ్యాసంగ ములందు నిరంతర వ్యగ్రులయ్యు వారొకవంక కావ్య సృష్టియు గావించుచుండుట కడుముదావహము. అసలు కవిత్వమన్నది వారి జిహ్వకు నైసర్గిక గుణమట్లు తోచును. వారి వైదుష్యము బహుముఖమైనది. సంస్కృత ప్రాకృతాంగ్ల భాషా సాహిత్యములను గూడ తరచిచూచినారు. అట్టి వ్యుత్పన్నులు నుత్తమ సంస్కారులునైన వారు కావ్యరచన సాగించు చుండినచో మన వాఙ్మయమింకను ఉదాత్తస్థితి ప్రాపింపగలదు. ఇంతవరకు వారివి రఘునాథ రాయలు, కనకాభిషేకము నను రెండు నవలలు ప్రకటింపబడినవి. అందు రెండవది ఆంధ్ర నవలా వాఙ్మయమున నొక యనర్ఘరత్నము. వారి వొక రెండు కావ్యములును ప్రకటితములైనవి అః. సుజాత, ఉషారాగము నునవి. అందు సుజాత కావ్యాను శీలనము ప్రస్తుతవ్యాసవిషయము.]

సుజాత చరిత్రము గౌతమబుద్ధుని జీవితోదంత ముతో ప్రత్యక్షసంబంధముగలది. గౌతముని మహాభినిష్క్రమణ మైనది కాని యాతడింకను బుద్ధుడు కాలేదు - అంతులేని అన్వేషణలో యోగ సంచార ములు చేయుచుండినాడు. ఆ సంధికాలమున అతుల మహానుభావుడగు నతని సందర్శన భాగ్య మందిన సుకృతి సుజాత. అంతేకాదతని తపస్సు ఫలించి యతని సన్యాసము సార్థకము కాగల పుణ్య కాలము సమీపించుచున్న దనగా తాను మొక్కు బడి చెల్లింపబోయిన యొక చెట్టుక్రింద, యోగ సమాధి నిష్ఠుడై చిరకాలోపవాసములచే తపస్సుచే చిక్కి శల్యావశిష్టుడై యున్న స్థితిలో అతడే తన నైవేద్యము స్వీకరింప దివినుండి దిగివచ్చిన దేవేశ్వరు డను పవిత్ర భావనతో అతని కమృతోపపన్నమగు పాయసాన్నము నివేదించి తన సాధ్వీహృదయమా విష్కరించి అతని యాశీస్సులందిన యశస్సుందర మూర్తి యామె. ఆమె యుదంతము లలితవిస్తరాది బౌద్ధగ్రంథములందు గలదు. బౌద్ధజాతక కథలను సుజాత జాతకమని యొకటి కలదు. అందు బోధి సత్త్వుడే సుజాత నామధేయుడు. అట్లే మహాసుత సోమజాతకమునందు ప్రసక్తమైన సుజాత కథవేరు. అందును ఆ సుజాతనామ మొక పురుషునిదే. లలిత విస్తరమునందు సుజాత పాయసము సమర్పించిన దినమే గౌతముడా విఖ్యాత పరిపూర్ణబోధకళా స్వరూపుడైన సుదిన మనియు, ఆనాడు వైశాఖ పూర్ణిమయనియు, ఆ వేళ కతడే మహావటచ్ఛాయ యోగ సమాధినుండి యుండెనో అదే తత్రాపి బోధి వృక్షమని వ్యవహృతమైనదనియు గలదు. * ఈ

* అసలు 'మహాబోధి' యన్నది గయలోని అశ్వత్థవృక్షము

గాథ ఎడ్విన్ ఆర్నాల్డు పండితుని గ్రంథరాజమగు Light of Asia యందు గ్రహింపబడినది. అదే మన ఆంధ్ర వాఙ్మయమున మొట్టమొదట కాకర్ల వారి కావ్యవస్తువుగా వెలసినది.

అసలు మొన్న మొన్నటి దనుక బుద్ధుడు పుట్టిన భూమిలోనే అతని పేరు ప్రతిష్ఠలు విస్మృతము లైనవి. ఏనాటి బుద్ధుడు! ఈ నాటి కిరువది యైదు వందల యేండ్ల క్రిందటి మాట యతని చరిత్ర. దూరదూర దేశాంతర సీమలకు ప్రాకిన దతని ప్రతిష్ట. ప్రాచీన కాలమున ఆంధ్ర విషయమునను బౌద్ధారామము లనేకము నెలకొన్న తార్కాణాలుగలవు. కాని యాశ్చర్య మాతని జీవిత చరిత్రకాని, పాళీ వాఙ్మయము నందలి తదితర బౌద్ధగాథలుగాని ఆ తత్త్వబోధనలుగాని మన ప్రాచీనాంధ్ర వాఙ్మయమున మచ్చునకైన గానరావు. పందొమ్మిదవ శతాబ్దిలో పాశ్చాత్య పండితులచే పాళీవాఙ్మయ పరిశోధనలు ప్రారంభమైన తరువాతనే మనకా ప్రాచీన సంస్కృతీ స్మృతులు కలిగినవి. (మన ప్రారబ్ధము - బౌద్ధమత ప్రతిష్ఠల విషయమున పరదేశములకున్న పరపతి మన భారతదేశమునకే లేకపోయినది; అట్లే మన పాళీ వాఙ్మయము గూర్చియు పరదేశ పండితులు పరిశోధనలు జరిపిన పిమ్మటనే తెలిసికొంటిమి మనము. మన కవులలో నవనవ చైతన్యస్పృహ కలిగినది. అనేక బౌద్ధగాథ లాధునిక కావ్యేతి వృత్తములై వెలసినవి. ఆ విషయమున ఆంధ్ర కవులకు మార్గదర్శకము, చిరస్మరణీయులగు తిరుపతి వేంకట కవుల బుద్ధచరిత్ర. ఆంధ్రుల బౌద్ధగాథా కావ్యనందన వనమందారము సౌందరనందము. ఆ రెండును ఆ పేరింటి అశ్వఘోషుని సంస్కృత కృతుల కించుమించు నువాద ప్రాయములైనవి. అట్లుగాక బౌద్ధవాఙ్మయము నుండి గాథను మాత్రము గ్రహించి స్వతంత్ర కల్పనలతో మనోజ్ఞవర్ణనలతో, సూక్ష్మములో మోక్షమనునట్లు అల్పపరిమాణముగల సుజాత కథను సర్వాంగ సుందరముగా తీర్చినవారు శ్రీనరసింహము గారు.

ఏతత్కావ్య కథాసందర్భరచనా సౌందర్యముల నించుక పరిశీలింతము. సేనాని పురమున సత్యరతు ♦ డను గొప్ప గృహస్థొకడుగలడు. అతని అర్ధాంగ లక్ష్మియే సుజాత. ఆమె అందాల పేటి, పరమ పతివ్రత, వివిధ విద్యాప్రవీణ. ఇరువురును వితరణ ఖనులు.

"రమణి వాసంతి కారామ రమ, విభుండు
మధుర మధుమాస వాసర మాధవుండు
ఛాన శారద చంద్రికా సార ధార
విపుల కాదంబినీ ముక్త విధుఁ డతండు
'అడిగిన వారికి నా సత్యరతుఁ డిచ్చు
నడుగక మున్నిచ్చు నతివ మిన్న

ఇట్లు సాగిన వారి యనురూపదాంపత్య వర్ణనలో ఉదాత్తదాంపత్యాదర్శములను ప్రతిపాదించినారు కవిగారు. వారి గుణగణములలో అగ్రగణ్యము వదాన్యత. వారి వదాన్యవరేణ్యతకు పరీక్షాసమయముగా -

'సకల ప్రాణిభయంకర వికటోద్ధత కటు
కఠోర విన్యాసములన్
వికృతక్షామపిశాచము నృకపాల కరాళ
మవని నృత్యము చేసెన్'

పై పద్యములో ఆ పదగతిలో నచ్చముగా క్షామపిశాచి అడుగుల సవ్వడి స్ఫురించుచున్నది. ఆ వర్ణన సుదీర్ఘముగా స్వభావోక్తి శోభావహముగా సాగినది.

ఉదా: పంటచేలపై దాడివెడలిన మిడుతల దండు' తోయదమాలికా కృతిని దోఁచి నభోంతర

♦ ఈ పేరు లలిత విస్తరమున గాని Light of Asia లో గాని కానరాదు.

వీధి, భూమికిన్ జీయను నివ్వనం బెసఁగఁ జీకటి గ్రమ్మఁగ' దిగినదట.

'విలవిలఁదన్నుకొంచు నొడి బిడ్డడు శోషిలి మూర్ఛ మున్గూ వలవలనేడ్చి తల్లి కలవారల వేఁడఁగ లేవ బోయి కాళులఁ బసలేక కూలఁబడె' నట.

'ఎంగిలి యాకుందినఁగాఁ బంగు విశీర్ణాంగుఁ

డొకఁడు ప్రాకుచునుండన్ జెంగునఁజని శునకము దా నింగలుచుచు నేఁగె' నట.

కాని 'కలవారికిఁ గఱవు పైడి కానుపు'; 'కఱవు చేహరి పాలిటి కల్పతరువు'; తద్విశదీకరణమున వాస్తవికత యుట్టిపడుచున్నది. కఱవు కాలమున 'బచ్చు - జీవుల పాలిరాబందు వాఁడు;' ఆ కఱవు బచ్చుల విశేషణముల ప్రయోగములో అల్పాక్షర ముల ననల్పార్థరచన గావించినారు కవిగారు.

ఆ కఱవు కాలమున [ఆ పుణ్యదంపతుల వితరణ ప్రక్రియ యెట్టిదో విపులముగా వర్ణింపబడినది.

'సత్యరతుఁడై సాధుసాహాస్మ హేశుండు
అతని ధర్మపత్ని యన్నపూర్ణ;
అడుగ లేని వారె యర్థహీనులు గాని
యడిగి నంత నంద రర్థసతులె'

ఇక క్షామావసానము - వర్షాగమసూచన. తదుపరి శరదృతు వర్ణన. ఇవి కవి ప్రకృతి పరిశీలనా దక్షతను పట్టియిచ్చు సుందర సందర్భములు :

'ఉదయాస్తమయముల నుగ్రదీధితి దోఁచెఁ
బగడాల జిగిమించు పసిఁడిఛాయ
పరివేషములు గట్టె భాను బింబమునకు
హిమధామునకు నించు కెడముగాను
అభ్రంకషమ్ములౌ నద్రిభాగములెల్లఁ
గాటుక పూసిన కరణి నొప్పె
చరమాద్రిపై నొక్క జలదఖండము దోఁచి
నడువసాగెను పూర్వనగము వంక
మడువు మలుఁగున నెండకు నొదిగి యున్న
భేక మొనరించె నొక్క గంభీర రవము
చిన్న తెక్కలతో మన్ను మిన్నుఁ గప్పి
యగణితమ్ముగఁ దూనీగ లాడఁ జొచ్చె'

'వికచారవిందకాశము సకల జనామోదకరము చారు జ్యోత్స్నా ప్రకటిత సర్వ దిగంతము చక చకితనదీ నదంబు శరదృతు వొప్పెన్'

ఆ శరత్కాలమున 'అట్టిటు గంధవాహమ్ముడు లాహతికిన్ గడుదూగియాడుచు... చదలఁబోయెడు చిల్కల కాన గొల్పుచు' పొట్టలతో గనుపట్టు సస్యములు, అమృతము వెల్లువలై పాడినట్లు'ను, చంద్ర మండలపు పెళ్లలు పీడినట్లునున్న 'తెల్లు'

'పంటవలతి చేతి పసుపుముద్ద వలెనున్నదోన, భూదేవి భటుల భమిడి బెత్తముల వలెనున్న చెఱకు తోటలు, కొలకుల జలదేవతల కత్తినని వాళులవలె అంటిదొప్పల దేలియాడు కార్తిక దీపములు మొదలగు విషయములను వర్ణించుటలో నుపయోగింప బడిన ఆ ఉపమలు నుత్ప్రేక్షలు నతిమాత్ర మనోజ్ఞములు.

తొలకరి పంటలతో నే ఊళ్లు కలకల లాడినవి. 'మలిపంట తోడ నందఱుఁ గలవారే కట్టఁబెట్టఁ గలిగిన వారే' 'చల్లని తల్లి సుజాత పెట్టిన దీప మిది యంచు మొక్కుల నిడెడివారు' జనులు. ఆమెకు వేవేగ కడుపు పండుగాక దీవనలిచ్చెడివారు.

ఒకనాడు సుజాత నికటస్థవన మహీరుహము నది కోరిన కోర్కు లిచ్చు వనదేవతకు నెలవని తెలిసి రథా రూఢయై రాధికాభిధా సఖీసనాథయై సేవింపబోయి నది. త్రోవలో శుభశకునము లెన్నో తోచినవి. ఆ సందర్భమున రకరకముల రంగురంగుల పువ్వుమంజ రుల ప్రశంసయొకటి మనోహరముగనున్నది. అది

ముఖ్యముగా రచనాగతమైన మనోహరత్వము : (ఇది ముందు విశదీకరింపబడును.)

అంతకంటెను మనోజ్ఞము భావగతమైన యొక చమత్కారము :

'ఆకసమ్మున నల్లన నడుగుడెంచి
వ్రాలె నించుక దూరానఁ బాలపిట్ట
భావిపుత్రోదయానంద భాగ్యగరిమ
ఱెక్కల ధరించి వ్రాలినట్లక్కజముగ'

ఆ వెను వెంటనే ఆమె రథగతి వనాంత జంతువులలో కలిగిన అలజడి చిత్రణలో సామాన్య కవులకసాధ్యమైన స్వాభావిక ప్రతిచర్య (natural reaction) చక్కగా సున్నితింపబడినది.

చూడుడు:—

'అరమేసి కసవులో నత్రాత్తి నిలచెను
మౌనిరాజుల హోమధేనుకంబు
ఘుర్ఘుర ధ్వనులతోఁ గదలివచ్చెడు ఘోణి
తొలఁగి నిల్చెను ద్రోవమలుపులోన
కొమ్మపైనుండి చెంగున దూఁక నుంకించి
యట్టె నిశ్చలుఁడయ్యె నగచరుండు
పొదరింటిలోనుండి పొంచి మెల్లగఁజూచి
దవుదవ్వులుగ జాఱెఁ జెవులపిల్లి
కసరుగాయను నోరితోఁ గఱచిపట్టి
త్రుళ్ళిపడినట్టు లిట్టటు దూఁకె నుడుత
మంద మందమ్ముగా వనమార్గమందు
నమ్మహాసాధ్వి రథమేగు నవసరమున.'

తరువాత సుజాత వనసీమ చేరినంతనే పరిసర ప్రకృతి నిత్యలక్ష్మీ స్వరూప యామెకు వనలక్ష్మి పొనరించిన సమాదరణమువలె నున్నదని కవిగారు చేసిన రూపకల్పన కడుమనోజ్ఞము.

'శారికా కీర సుస్వర భాషణమ్ముల
సమ్మదంబుగ స్వాగతమ్మువల్కి
జలజలపాఱు నిర్ఘర తరంగాలచే
నర్ఘ్య పాద్యాదిక మాచరించి
ఛాయా సమాచ్ఛన్న చారు శాద్వలచిత్ర
కంబళాసన మిడిగౌరవించి
చలమరు శాఖాగ్ర విలులిత మంజుల
ప్రసవ మంజరుల నర్చన మొనర్చి

తరువాత సుజాతపూజ, పూజాఫలమగు పుత్రోత్సవము సువర్ణితములు. 'ఊరంతయు నుత్సవములె, పౌరవనితల వినోద సంభాషణలె.' ఇట నొక చమత్కారము.

'కలకాలమునకుఁగలిగిన । తొలిబిడ్డం గాంచు తండ్రి తోషము దెల్పం । గలమే మాటల ? నయ్యది । పలుకుల కందంగరాని భావముకాదే' అనుచునే కవిగారు—

'చందురుఁ గాంచిన జలనిధి । చందంబునఁ బొంగెనంచు సామాన్యముగా । నందఱుఁ జెప్పెడు రదియే । పొందికయగునేని దానిఁ బొసఁగింపనగున్' అని యనుటలో ఆ యానంద మనుభవైక వేద్యమనియు, అంతగా మరియొక సందర్భముతో దానిని సరిపోల్పవలసియే వచ్చినచో 'చందురుఁగాంచిన జలనిధి చందము' ఉత్తమోపమానమే కాని అది సర్వసామాన్యమైనదగుటచే తన కిష్టములేదనియు ఇష్టపడు పాఠకులు దానిని గ్రహించుటలో దన కభ్యంతర ముండబోదనియు నన్నట్లుగా కవిగారు సూచించుచున్నారు. ఉపమల కతీతములగు నుదాత్త విషయముల నుదారముగా ఆవిష్కరించు విదగ్ధకవుల ఫణితి ఫక్కికలలో నిది యొక్కటి. అట్టిదే సుజాత సుతునిగూర్చి సరాధిక యాడిన ముచ్చట:— అల్పాక్షరముల ననల్పార్థ రచనమునకు నదియొక చక్కని యుదాహరణము :

'బంగారు మూటయగు నీ బాలున్ । దొంగిలి చన మనసగు నా । వంగడమున లేనిమచ్చ వచ్చినను సరే.'

కొన్నాళ్లకు సుజాత తన కోర్కె ఫలింపజేసిన వనదేవత కుపాయన మిచ్చుకొఱకు వనమున కరిగినది. సరిగా నదే వేళ నా చెట్టు క్రిందనే గౌతముడు యోగ సమాధినిష్ఠుడైయున్నవాడు. ఆ సందర్భమున 'లలిత కంకేళి పల్లవరాగము హసించు జగజంపు నిడుద కెంజడలతోడ'; 'మౌన ముద్రితమయ్యు మంజుల స్మేర సుందరమైన నెమ్మోము దమ్మివాని' - ఇత్యాదిగానున్న రెండు సీసములలో అతనిమూర్తి చిత్రణ మతి నిపుణముగా నిర్వహింపబడినది. తపస్సుచే నతనికి ప్రాప్తించినవి రెండు - తను కార్శ్యము, దివ్య తేజస్సు. అతఁడపుడు 'మంచుగప్పిన మార్తాండ మండలంబు కరణి నొప్పారు' చున్నాఁడట! కవిగారి పలుకెక్కడ పట్టిచూచినను కండగలది.

సుజాత యతఁడే వనాధిష్ఠాన దైవతమనుకొని డాయంబోయినది. 'కలికీ! గజ్జెలు నందెలు। ఘల్లు ఘల్లున మ్రోగునట్లు కదువడి నడువన్। వలదలుగుదురు రవంతకు। నలజడికిం దేవతాళి యనగా వినమే' అని హెచ్చరించినది రాధిక. ఆ సన్నివేశమొకటి చిత్రమైనది. సుజాత పాయస మర్పించినది. ఆ పాయసము నాప్యాయముగా మారుమాటనక ఆరగించి, ఆరగించినంతనే నూతన చైతన్యము ప్రాప్తించినట్లై, తథాగతుడు యథాతథముగా తన చరిత్రము నామెకు వినిపించినాడు. అప్పటి కప్పుడే తానిర్వచనీయమైన ఆత్మవికాసమును బొందినట్లు పోల్చుకొనగలిగినాడు. సుజాతయొక్క ఆననసీమ దోను 'నిత్యప్రమోదభావ' మరసి యబ్రపడినాడు. ఆననసీమ నట్లా భావము నిత్యప్రత్యగ్రముగా నిలువవలెనన్నచో అంతరంగము శాంతి ప్రకృష్టముగావలెను. అట్టి శాంతి గురించియే అతని అన్వేషణ. అది సుజాతలో ప్రస్ఫుటముగా జూచినాడు. తత్సాధనగూర్చి యామెను పృచ్ఛించినాడు. ఆమె పాతివ్రత్య ధర్మనిర్వహణము, సత్కర్మాచరణము గురించియు నుపన్యసించినది. అసలామె శాంతికి మూలకారణము ప్రగాఢమైన ఆత్మసంతృప్తి. ఆమె గుణగణములలో విశేషము వితరణము. వితరణమునకు మూలము భూతదయ. ముందుముందు బుద్ధుడు ప్రవచింపనున్న ధర్మములలో ముఖ్యమైనది భూతదయ. గౌతముడామె యంతస్స్వరూపమును గ్రహించి, 'వనిత! బుద్ధులు గలినవార మనుచు। గర్వపడువారలెల్ల నీ కడకు వచ్చి। హృదయ శాంతికి మార్గమ్ము నెఱుఁగవలయు'నని ప్రశంసించి యాశీర్వదించి యరిగినాడు. అవల కొన్నాళ్లకు ప్రపంచము బుద్ధనామ ప్రతిష్ఠతో మార్మ్రోగిపోయినది. సుజాత మరల నతని సందర్శించి సుగతికి బోయినదట.

సహజముగా ఈ కథయందంతము నందింత చమత్కారము తప్ప నడుమనంత చమత్కారము లేదు. అయినను బుద్ధదేవుని ప్రశంసకు పాత్రయైన పవిత్ర చరిత్రయగు సుజాతకథకొక సురుచిర కావ్య స్వరూపమిచ్చిన శ్రీ నరసింహము గారెంతయు ప్రశంసనీయులు.

సుజాతకథలో ముఖ్యముగా ప్రపంచింపదగిన సందర్భములు మూడు - సుజాత ఉత్తమ హిందూ గృహిణి. హిందూ గృహిణి యగుటచేతనే బిడ్డకొఱకొక చెట్టునకు మ్రొక్కుబడి చెల్లించుట. ఆ సన్నివేశమే గౌతమ సమావేశమున కవకాశమిచ్చినది. ఆ సమావేశమే బుద్ధచరిత్రలో ఆమె నొక విశిష్ట స్థానమున ప్రతిష్ఠించినది. అందులకు గౌతము నాకర్షించిన లక్షణము లామెయందుండుట కారణము. అనగా ముందునాటి బౌద్ధధర్మ స్వరూపము కొంత ఆమె యందంతర్భూతమైయున్నదనుట. అసలు హిందూమతములో సూత్రప్రాయముగానున్న ధర్మసూక్ష్మములే అనేకము బౌద్ధమున ప్రపంచింపబడినవి. అందులో 'ఆత్మవత్సర్వభూతాని' అనునదొక ముఖ్య ధర్మము. ఆ ధర్మ సంపత్తి సుజాతయెడ సమృద్ధిగానున్నది. అది నిరూపించుటకే క్షామసన్నివేశము కల్పించి ఆ సమయమున ఆమె వితరణ ప్రశంసను సుదీర్ఘముగా వర్ణించినారు కవిగారు. తదుపరి ఆమె సుకృత విశేషమున దేశము సుభిక్షమై పంటలుపండి అప్పుడే ఆమె కడుపుగూడ పండినదనుట, ఆ నడుమ వర్ష శరదృతువులను వర్ణించుట, ప్రధాన సన్నివేశోన్ముఖముగా (సుజాతా గౌతముల

సమావేశ మిందలి (ప్రధాన సన్నివేశము) ఈ రెండు సన్నివేశములకును గార్యకారణ సంబంధమును సూచించుచు కథను నడిపించుటయు కవిగారికి గౌచిత్య సంఘటనమునందుగల సూక్ష్మదృష్టిని వ్యక్తము చేయుచున్నవి. అయితే ఆ మొదటి రెండు సందర్భములును ప్రపంచింపబడినంతపట్టుగా అసలైనదా ప్రధాన సన్నివేశమే ప్రపంచింపబడలేదు. అదియొక లోపమే యనకతీరదు. మరియొక విషయము - ఈ గ్రంథపుటెత్తుగడ - స్వర్గవాసినియైన సుజాత ఒక సౌరవిమానమున దేవకాంతా పరివేష్టితయై యుండగా కవి యామెను గాంచినట్లును (స్వప్నమునగానోపును.) కవికి తచ్చరితము నామె సఖి యొకర్తు వినిపించినట్లునుగలదు. ఈ ఎత్తుగడలో ప్రత్యేకత యేమియు గానరాదు. గ్రంథోపక్రమోప సంహారము లెట్లున్నను, కథ చిన్నదైనను, కడమంతట కావ్యగుణము లున్నతస్థాయిలోనే యున్నవి. వర్ణనలు 'ముత్తసరి'గా స్వభావోక్తి సుషమా సుభగములుగానున్నవి. అల్పాక్షరములలో అనల్పార్థరచన, పటువులైన పదబంధములలో ప్రౌఢములైన భావములును తరచు గన్పట్టును. ఇందలి శయ్యా ధారాధోరణీ భాసురమైనది. ప్రాచీన ప్రబంధములందలి మార్దవము నంతటిని పుణికి పుచ్చుకొన్నట్టిది. సమాసద్రాఘిష్ఠమైన సంస్కృత రచన, అలతియలతి పదముల తేటైన తెనుగురచన, అనవసర గాఢపాకా డంబరముగాని పేశలశైలి, అపేలవమైన సరళశైలి ... ... ఈ ఉభయ ఫక్కికలును నరసింహముగారికి కరతలామలకములే. వృత్తములేమి జాతులేమి యుపజాతులేమి ప్రతి చందస్సును వారి చేతిలో హుందాగా సాగిపోవును.

అందును కంద పద్యములో - 'మలిపంటతోడ నందఱు౹ గలవారే, కట్టఁబెట్టఁగలిగినవారే'; 'ఊరంతయు నుత్సవములె౹ సారసనయనల వినోద సంభాషణలే' అని యిట్లు పాదమధ్యమున నొక అందమైన విరుపు, పాదాంతమున నొక చక్కని తూగుచూపుట ఆ కందపద్యరచన కైవాడములో నొక మెలకువ. సీసపద్య రచనా శిల్పములో శ్రీనాథుని ప్రౌఢి అనగా పంచమాత్రాక గణప్రయోగము, ప్రతిపాద సమతాపాదనము కాకర్ల వారి కలమున కలవోకగా పట్టువడినవి.

బాలభాను ప్రభాభాసు రశ్ములు కొన్ని
చంద్రాతపోజ్జ్వలచ్ఛవులు కొన్ని
చురుహరిద్ర భాస్వత్తేజములు కొన్ని
గాఢ సిందూర రాగములు కొన్ని

ఇక ఉదాత్త వృత్తగతికొక యుదాహరణ:

'రాజతశైలరాజ శిఖర ప్రతిమాన తదభ్ర
యాన వి
భ్రాజదనూన సూన మధుపాన విజృంభిత
మత్తషట్పదీ
నైజమనోజ్ఞ ఝంకృతులు; నవ్యకిసాల
యఖాది కోకిలా
కూజితముల్ దిగంతముల ఘూర్ణిల
జేయుచునుండె నెంతయున్.

నరసింహముగారి 'ఉషారాగము'న బహువిధగీతిచ్ఛందస్సులందును వారికిగల నైపుణ్యమును జూడగలము. అది యొక ఉజ్జ్వలకృతి. వారిలో ఒక మహాకవికి కావలసిన లక్షణ సామగ్రి యంతయు నున్నది. అయితే వారి అమృతలేఖినిద్వారా ఒక మహాకావ్యము వెలువడుటే తరువాయి.

సుజాత కృతిభర్త సుగృహీత నామధేయులగు శ్రీ కొత్తా సచ్చిదానందమూర్తిగారిని స్మరింపక యీ వ్యాసము సమగ్రము కానేరదు. వారు గీతాభాష్యాద్యనేక గ్రంథకర్తలు, ప్రకృత మాంధ్ర విశ్వకళా పరిషత్తత్త్వ శాఖాధ్యక్షులు. ఉత్తమతత్త్వ ప్రతిపత్తి సారభూతమగు నీ కావ్యమునకు వారి కృతిపతిత్వ మెంతయు తగియున్నది.

ఈ కృతి పరిచయము నాకు గల్గించి, కృతికర్త, భర్తల గురించిన విశేషములు నాకెఱుకపరచిన నా స్నేహితురాలు శ్రీమతి రాజేశ్వరీ రాణికి నా కృతజ్ఞత.

# 'శలవల్లో'

శ్రీమతి దేశిరాజు విజయలక్ష్మి

['శశి', 'వాణి' కూర్చుని మాట్లాడుతూ ఉంటారు]

శశి:–వాణి! రేపేగదా కాలేజీ మూసేదీ – ఈ శలవల్లో యింటి కెళ్తావా? లేక ఎచ్చటికైనా ఎక్సుకర్షన్ (విజ్ఞాన యాత్ర) కెళ్తావా?

వాణి–ఇంకా ఏమీ అనుకోలేదు.

శశి:–వాణీ! ఈ శలవల్లో మా ఊరు వెళ్దాము రావే. శలవలు కాగానే చక్కగా యిద్దరం కలసి కాలేజీ కొచ్చెయ్యవచ్చు.

వాణి:–వీలుండదేమో! మా నాన్నగారే మంటారో మా ఊరు వెళ్లకపోతే!

శశి:–ఏమీ అనర్లే. నీవు తప్పకండా మా ఊరు రావాలి. మా నాన్నగారికి మనిద్దరం కలసి వస్తున్నామని చెప్పి ఒక లెటర్ వ్రాస్తాను యివాళే.

వాణి:–సరే లేవే – మీ ఊరు చూడాలని నాకూ చాల కుతూహలంగానున్నది.

శశి:–ఆడినమాట తప్పరాదు. రేపు రాత్రే ప్రయాణం – సిద్ధంగా ఉండు. గుడ్ నైట్.

వాణి:–యస్ – గుడ్ నైట్.

## 2-వ రంగము

[వాణి తన రూమ్‌లో కూర్చొని ఏదో సర్దుతూ ఉంటుంది. ఇంతలో "అమ్మగారూ! ఉత్తరాలు" అని కేక వినపడుతుంది. గబగబ వాకిట్లో కెళ్ళి తీసికొస్తుంది రెండు ఉత్తరాలు. మొదటి ఉత్తరం తీసి పైకి చదువుతుంది.

చిరంజీవి వాణికి!

నీవు శలవ లిచ్చిన వెంటనే బయలుదేరి మన ఊరు రావలసినది. మీ అమ్మ నీ కొరకు ఎదురు చూస్తున్నది. నీరాక కొరకు ఎదురుచూస్తున్నాము.

ఇట్లు

మోహన్‌రావు

అయ్యో! నిన్ననే శలవల్లో శశిగారి ఊరు వస్తానని మాట యిచ్చానే? నాన్నగారు యిలా రాశారు. సరే ఈ రెండో ఉత్తరం చూస్తాను.

డియర్ వాణి!

నీ యీ శలవల్లోనే నా వివాహం. నీ రాక కొరకు ఎదురు చూస్తున్నాను. అంతా క్షేమము. నీవు నీ బాల్య మిత్రురాలిని మరచిపోలేదనీ, తప్పక వస్తావనీ తలుస్తూ నీకీ జాబు వ్రాస్తున్నాను.

నీ కొరకై ఎదురుచూచే

నీ

'లత'

"సరే. 'లత' పెండ్లి యీ నెలలోనేనే. ఇప్పుడేం చెయ్యాలి? 'శైలజ', 'వనజ' యింకా రాలేదు. వాళ్లురాగానే వాళ్ల అభిప్రాయాలు తీసికొని ఆ విధంగా నడచుకుంటాను."

## 3-వ రంగము

[సాయంత్రం నలుగురూ నాలుగు కుర్చీలలో కూర్చున్నారు.]

వాణి:-శశీ! మా నాన్నగారి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది మా ఊరు రమ్మనమని. మా బాల్య మిత్రురాలు లతేమో - తన పెండ్లిట, రమ్మనమని వ్రాసింది. ఏంచేసేది?

శశి:-వాణీ! ఆడినమాట తప్పరాదు. నువ్వు మా ఊరు రావలసినదే.

వాణి:-శైలజా! వనజా! మీ రిద్దరి సలహా ఏమిటి?

శైల:-వాణీ! మీ నాన్నగారి మాటను గౌరవించవలయునుగదామరి! అందుచే మీ ఊరు వెళ్లు.

వాణి:-అదికాదే! నీవు కోమటి సాక్ష్యము చెప్పకుండా స్పష్టంగాచెప్పు. ఇంత ప్రాబ్లమ్ ఆ నెహురూగారికి గూడా ఉండదు. నా కొచ్చిపడింది - సరే - మా ఊరు వెళ్తే లతగారి ఊరు వెళ్లవద్దూ? దాని పెళ్లి చూడవద్దూ?

వనజ:-లత పెళ్లికి తప్పక వెళ్లాలి. నీ బాల్య స్నేహితురాలుగదా! ఫస్టుఫారమ్ నుండి, యస్. యస్. యల్. సి. వరకు ఒకచోట చదివి, ప్రాణమిత్రులుగా నున్నారుగదా! అందులోను మీ యిద్దరూ బంధువులుకూడాను. తన పెళ్లికి నీవుతప్పక వెళ్లవలసినదని నా సలహా.

వాణి:-మరి శశిమాట! శశికి నిన్న వాళ్ల ఊరు వస్తానని మాట యిచ్చాను. 'ఆడినమాట తప్పకూడదు ప్రాణం పోయినా!' ఎల్లాగా?

శశి:-ఎల్లాగేమిటి? నీవు శశితోపాటు వాళ్ల ఊరు వెళ్లుటే మంచిదని నా సలహా.

వాణి:-ఇది చాల బాగుంది. ఎవరికి తోచినట్లువాళ్లు చెప్తున్నారు. నేను ఏంచెయ్యాలో సరిగా చెప్పండి. ఇదేనా మీ తెవులులు? వనజా! ప్రతిదాంట్లో ఫస్టుమార్కులు కొట్టావే! ఆ తెలివి అంతా ఎక్కడపోయింది? శైలా! 'డిబేటింగ్ సొసైటీస్'లో అనర్గళంగా మాట్లాడేస్తావే! నీ తెలివి ఏ ఊరు పోయిందీ? నాకు న్యాయం చెప్పండి. శశీ! నీ బుద్ధి ఏ ఊరు పోయింది?

శశి:-నా బుద్ధి యిప్పుడే మా ఊరు పోయింది. నువ్వుకూడా వస్తావు - మా ఊర్లో సర్దాగా గడుపుదాం అనుకుంటూ ఆలోచిస్తున్నాను. న్యాయాన్యాయాలు నాకనవసరం. నీవు మా ఊరు రావాలి. తప్పదు.

శైలజ:-వాణీ! మీనాన్నగారి ఊరు వెళ్తే లతకు కోపం, లతగారి ఊరు వెళ్తే శశికి కోపము. ఈ రెండు చోట్లకు వెళితే మీనాన్నగారికి కోపం. నేను

శలవల్లో ఆగ్రా వెళ్తాను. సుభ్రూ నేను కలసి ఆగ్రా వెళ్ళి 'తాజమహాల్' దర్శించివద్దామూ. ఇంకా టైమ్ ఉంటే కాశీ, రామేశ్వరాలు వెళ్దాము. మనకు 'కాలక్షేపం', 'పుణ్యమూ' 'పురుషార్థము' అన్నీ సమకూడుతయి. ఎందుకొచ్చిన గొడవ - నాసలహా పాటింప దలచుకుంటే సిద్ధంగా ఉండు - రేపు రాత్రే మన ప్రయాణము.

వనజ:-వాణీ! అసలు శలవలు ఎన్ని రోజులే - వీళ్ళగోలకేంగాని?

వాణి-:ఇరువది అయిదు (25) దినములు.

వనజ:-ముందు మాటయిచ్చింది ఎవరికి?

వాణి:-'శశి'కి.

వనజ:-ఈ రోజు రాత్రే నీవూ శశీ ప్రయాణమై వాళ్ళ ఊరు వెళ్ళండి. తర్వాత ముందు ఎవరి దగ్గరనుండి వచ్చింది ఉత్తరం.

వాణి:-నాన్నగారి దగ్గరనుండి. తర్వాత లత దగ్గరనుండి.

వనజ:-సరే వాళ్ళ ఊళ్ళో వారము రోజులుండి తర్వాత మీ నాన్నగారి దగ్గరకి వెళ్ళు. అచ్చట వారము రోజులుండి మీ 'లత' పెళ్ళికి హాజర్‌కా. అచ్చట వారము దినములుండి ఈఊరువచ్చేయి.

వాణి:-ఒక రోజు ముందుగానే యీ ఊరు వస్తాను. కూడారండి. అందరము ఆ రాత్రి సినిమాకెళ్దాం. వనజా! నిజంగా నీవు మంచిసలహా యిచ్చావు, ముగ్గురులో ఎవరికీ కోపంరాకండా-నీకు నా థాంక్సు. శైలా! నీ వుపన్యాసానికి నీకూ Thanks. శశీ ప్రయాణానికి రెడీగానే ఉన్నాను. ఈ రాత్రే మీ ఊరు వెళ్దాము.

శశి:-వనజా! శైలజా! గుడ్ బై-మళ్ళీ ఒక నెలకేమో మనం కలుసుకొనుట; తరచూ లెటర్సు వ్రాయండి.

వనజ & శైలజా:-గుడ్‌బై వాణీ & శశీ! లతకు మా ధన్య వాదాలు చెప్పు వాణీ. లెటర్స్ వ్రాయి నీ ప్రయాణమంతా. గుడుబై శశి & వాణీ!-గుడ్ బై.

డాక్టరు కే. యన్. కేసరిగారి రచన

'నా చిన్ననాటి ముచ్చట్లు'

వెల రు. 3-0-0

అన్ని హిగిన్ బాదమ్స్ స్టాల్సులోను దొరుకుతవి.

# బిడ్డలు - తల్లిదండ్రులు

## బిడ్డ కితరులతోగల సంబంధములు



శ్రీ కె. వెంకట్రామయ్య

### బిడ్డ సాంఘిక పరిణామము (Social Development):—

తల్లి గర్భమునుండి వెలువడిన కొన్ని వారముల వరకును బిడ్డ తన పరిసరముల నేమియు గమనింపడు. తానును, తనకు గలిగెడి యవసరములును (Wants), ఇంద్రియానుభవములును తప్ప తక్కినవేమియు నతనికి తెలియకుండును. తల్లి నాతడు తనకు జెందిన భాగముగనే గణించునుగాని వేరుగ తలంపడు. ఆమె యుండుట కేవలము తన సౌకర్యముకొఱకేయని భావించును. ఎదిగిన కొలదియు అతడితరులను గూడ గమనింప మొదలిడును. మొదట తల్లిని, తండ్రిని, అన్నలను, అక్కలను గమనించుచుండును. ఇక కొన్నాళ్లకు ఇంటికి వచ్చెడి క్రొత్తవారినిగూడ గుర్తించుచుండును. అతి బాల్యమునుండియు అతడు కొన్ని సహజమనోప్రవృత్తులను (Characteristic attitudes) జూప నారంభించును. అవి యాతని తరులతోగల సంబంధములందు ప్రయోజనకరమగుటయు, కాకుండుటయు, పెంచెడి విధానముపై నాధారపడియుండును.

బిడ్డ సరియగు సాంఘిక సంబంధముల నేర్పరచుకొనుటకు సహాయపడుట విద్యా విధానమున నొక భాగమైయున్నది. బిడ్డయు నితరులతో నెల్లపుడు కలసియుండవలెను. అట్లు కలసియుండుట సంతృప్తికరముగ జరుగవలెనన్న అతడాదినుండియు ఇతరులకును తనకునుగల సంబంధము లెట్లుండవలసినదియు సరిగా నెఱుగవలెను. లేనిచో అతడెదిగి పెద్దవాడయ్యును పిన్నవానివలె స్వార్థమును, వైరభావమును (Hostility), కలహ గుణమును (Aggressiveness) జూపుచు కష్టములను, బాధలను పొందుచుండును. స్వార్థమును, వైరభావమును, కలహ గుణమును జూపుచుండుట బిడ్డలకు బాల్యదశయందు సహజమే యగును. అట్టి మనోప్రవృత్తుల జూపుచు వారేదో శక్తిని (Power) బొందినట్లు భ్రమించుచుందురే గాని నిజమగు సంతోషము నేమియుపొందరు. గారాబముచే పాడైన బిడ్డలను గమనించిన మనకీవిషయము బాగుగ బోధపడగలదు. అట్టి బిడ్డలు తరచుగా నలుక జెందుచు, ఎదురించుచు ఏదో విచారముగ నుందురేగాని సంతోషముగ నుండజాలరు.

### మంచి మర్యాదలు (Good manners):—

బిడ్డ ఇతరులతో కలసిమెలసి యుండుటయేగాక సంఘ సమ్మతమగు ప్రవర్తనను గూడ కలిగియుండవలెను. అనగా అతడు మంచి నడతలను, మర్యాదలను అలవరచుకొనవలెను. అట్టి నడతలను మర్యాదలను అతడు సులభముగను, సంతోషముగను నేర్చుకొనవలెనని మొదటినుండియు వాని నతని కలవాటుజేయవలెను.

మంచి మర్యాదలయెడ బిడ్డకట్టి అసహ్యతయు నుండదు. నేర్పెడి విధానమందలి లోపములచే వాని నతడు నేర్చుకొనక బాధించుచుండును. మన మతని నర్థము జేసికొనక వేదించినను, అదుపాజ్ఞలలో నుంచక వదలిపెట్టినను వ్యతిరేక భావమును (Resistant attitude) జూప నారంభించును. అట్టి భావమును జూపుట అతని చెడునడతలో నొక భాగమే కాగలదు. బిడ్డ ప్రవర్తనమును సరిగా నర్థముజేసికొనదలచినచో అతని జీవిత పరిస్థితులను, తలిదండ్రు

లతో నతడెట్లు మెలగునదియు మొదట పరిశీలింప వలెను. అట్లు పరిశీలింపక అతని ప్రవర్తనా సమస్య లను వేరుగ భావించి వ్యవహరించుట పనికిరాదు.

మంచి మర్యాదలయెడ బిడ్డలకెట్టి అయిష్టతయు నుండదు. కాని మన నిర్బంధ విధానములచే వారా మర్యాదలను నేర్చుకొనక బాధించుచుందురు. దీనిని నిరూపించుటకుదాహరణముగ నొక బోర్డింగుస్కూలు నందు జరిగిన వింతవిషయము నొక దానినిగూర్చి ఇట తెలిపెదను. ఆ స్కూలులో 4 నుండి 10 సంవత్సరముల వయస్సుగల బిడ్డలను చేర్చుకొందురు. దాని నిర్వాహకు డొక అనుభవజ్ఞుడును బుద్ధిశాలియు నగు నుపాధ్యాయుడు, బడియావరణను దాటి బయ టకు బోకుండుట, వేళకు భుజించుట, నిద్రించుట; స్నానము చేయుట మొదలగు కొన్ని ముఖ్య నియ మములను పాటించుచు ఇక తమ యిష్ట ప్రకార ముండవచ్చునని అతడాబడిలో చేరిన పిల్లలకు ముందుగనే తెలిపెను. అట్టి స్వేచ్ఛనీయగనే వారం దరు "దయచేసి" (Please) అనుట, "వందన ములు" చెప్పుట, మొదలగు మర్యాదల నన్నిటిని పాటింపకమానిరి. భోజనపుబల్లకడ పాడుట, కేకలు వేయుట మొదలిడిరి. ఇంతవరకును వద్దనిన అమ ర్యాదకరమగు పనులన్నిటిని చేయ నారంభించిరి. కాని ఆ బడిలోగ పెద్ద లెవ్వరును వారి నాటంక పరుపకుండిరి.

పిల్లల నడవడి యెట్లున్నను పెద్దలు వారియెడ మర్యాదగనే ప్రవర్తించుచుండిరి. కొన్ని సందర్భ ములలో మాత్రము పిల్లలడిగిన ప్రకారము చేయ నిరాకరించుచుండిరి. కారణమేమన "ఆజ్ఞాపించిన" చేయుట వారికిష్టములేదు. "ప్రశాంతముగ భుజిం చుట" వారి కిష్టమగుటచే బిడ్డలతోచేరి భుజింపక వేరు స్థలమునకు బోవుచుండిరి. ఇట్లే వారింకను ఎన్నో విషయములందు వర్తింపసాగిరి. కాని బిడ్డ లను తమ భావముల కనుగుణముగ వర్తింపుడని నిర్బం ధింపలేదు. ఐనను, మొదటి "టర్మ్" ముగియు సరికి ఆ బిడ్డలు తమంతటతామే మంచి మర్యాదలను పాటింప మొదలిడిరి. దీనిని బట్టిచూడ బిడ్డల అయి ష్టత మంచి మర్యాదలయెడ గాదనియు వాని నల వరచెడి విధానము నెడలనేయనియు మనకు తెలియ గలదు. బిడ్డల తప్పుల నితరులముందు దిద్దప్రయ త్నింపరాదు. అది వారికెంతయు నవమానకరముగ దోచి అలుకజెందెదరు.

బిడ్డలు తమ యెడలను ఇతరుల యెడలను ఏవిధ ముగ ప్రవర్తింపవలెనని పెద్దలు కోరుచుందురో అదే విధముగ వారును బిడ్డల యెడలను ఇతరుల యెడలను గూడ ప్రవర్తింపవలెను. అనగా పెద్దల ప్రవర్తన బిడ్డల కాదర్శప్రాయము కావలెను. అట్లైనచో బిడ్డలు మర్యాదగ ప్రవర్తించుట మానవులకు సహజ మనుకొందురేగాని పెద్దలు తమ్ము బాధింప నేర్ప రచిన ప్రత్యేక విధానమని తలంపరు. తల్లిదండ్రుల మాటలను, స్వభావములను, ప్రవర్తనలను బిడ్డలు చాలవర కనుకరించుచుందురు. ఇది గుర్తించి తల్లి దండ్రులు తమ బిడ్డల కాదర్శముగా ప్రవర్తింప ప్రయత్నించుచుండవలెను. అట్లు ప్రయత్నించుచు చుండినేని బిడ్డలు వారి నడతల ననుకరించుచు మంచి మర్యాదల నెంతో సులభముగ నేర్చుకొనగలరు. వారొకచో తప్పుగ ప్రవర్తించినను "మేమెప్పుడైన నిట్లు ప్రవర్తించుట చూచితిరా" యని తల్లిదండ్రులు వారిని మందలింప వీలగును.

### విశిష్ట సాంఘిక ప్రవృత్తులు (Typical Social Attitudes)

ఇంతవరకు "మర్యాదల" విషయమును గూర్చి ఆలోచించితిమి. ఇక బిడ్డల సాంఘిక ప్రవృత్తులను గూర్చి (Social attitudes) తెలిసికొందము. బిడ్డలు జూపెడి మర్యాదలు కొంతవరకు వారి సాంఘిక ప్రవర్తులను సూచించునే యుండును. ఈ ప్రవృత్తు లను (attitudes) కొన్ని శీర్షికల క్రింద విభజింపనగును.

### తనయందే దృష్టినుంచుట Ego-Centricity or Self-centredness:-

ఈ ప్రవృత్తిని

జూపుట శిశుదశయందెంతయు సహజము. కాని బిడ్డ డెదిగినకొలది తనయందే దృష్టినుంచక ఇతరులను గూడ గమనించుచు వారి విషయములందును కుతూహలము జూపుచుండును. మొదట అతడింటియందలి వారియెడ కుతూహలము జూపుచుండెను. రాను రాను ఇతరులందరి యెడలను, అందు ముఖ్యముగా తన వయస్సు బిడ్డలయెడలను, కుతూహలము జూపుచుండును.

కొందరు బిడ్డలెదిగియు పశిపిల్లలవలె తమయందే దృష్టిని గలిగి ఇతరులపై నిష్టము జూపకుందురు. అట్టివారు సామాన్యముగ 'ఒంటి' బిడ్డలైయుండి తల్లిని వదలకుందురు. తల్లియు వారి నెల్లప్పుడు వదలక సంరక్షించుచుండుటచే వారామెను తప్ప వేరవరిని చేరకుందురు. ఆమె సంపూర్ణముగ వారియధీనమునందే యున్నను, వారి జీవితమున ఆమె ప్రభావమే ఎక్కువై యుండును. తల్లియే తనకోర్కెల దీర్పగలవ్యక్తి యగుటచే ఇతరులన్న వారికి గిట్టకుండును. తల్లీ బిడ్డలీ విధముగ ఒండొరులపై యాధారపడి యుండుట కాలము గడచిన కొలదియు ఎక్కువై ఇరువురకును బాధాకరముగ పరిణమించుచుండును. అన్నిటికిని తల్లిపై నాధారపడుచు స్వతంత్రతలేక యుండుటచే బిడ్డ కామెపై తెలియని కోపము గలుగును. అందుచే నాతడామె నెదిరించుచు ఆమెయెడ వ్యతిరేక భావమును, (Hostile attitude) జూపుచుండును. అట్టి భావమును జూపుకొలది తల్లీ బిడ్డలిరువురి మధ్యను తగాదా లేర్పడుచుండును. ఇంతేగాక తల్లి, బిడ్డ నెప్పుడైనను వదలి పోవలసివచ్చినచో అతడొంటరిగా నుండజాలక ఎంతో బాధపడును.

బిడ్డ ఎవరిని చేరక తానేలోకముగ చరించుట స్వభావమును బట్టియే గాదు. కుటుంబమున అతనికి గల స్థానమును బట్టిగూడ కావచ్చును. "నడిమి" బిడ్డ సంగతి నాలోచించిన మనకిది బోధపడగలదు. తండ్రికి మొదటి బిడ్డయు, తల్లికి కడపటి బిడ్డయు ప్రియమైనది. బిడ్డ ఒంటరియగుచుండును. లేదా మొదటి ఇద్దరు బిడ్డలును కడపటి ఇద్దరును కలసి యుండి నడిమిబిడ్డ వేరగుచుండును. అట్లగుటచే నతడు తానెవ్వరికి నక్కరలేదను భావమునొంది ఎవ్వరిని చేరక తనకు తానే యుండజూచును. అట్టియెడ అతనిని వేధించుటయు, విమర్శించుటయు జరుగుచుండిన అతని పరిస్థితి మరింత బాధాకరమగును.

ఊహాశక్తిగల కొందరు బిడ్డలు వాస్తవిక జీవిత సమస్యలనుండియు తప్పించుకొనుట కుపాయముగ, గ్రంధపఠనా నిమగ్నులై, మానవ సంపర్కమును గోరకుందురు.

## వైరవృత్తి, కలహాగుణము (Hostility Aggressiveness)

ఇట్టి మనోవృత్తులు బిడ్డలవ్యక్తిత్వమును సూచించుచుండును. వీనినణచుటకై ప్రయత్నించుటకంటె, ప్రయోజనకరమగు మార్గములకు ద్రిప్పి సంతృప్తిపరచుటమంచిది. కలహాగుణమును జూపెడి బిడ్డల కెల్లప్పుడు తగినంత వ్యాపకమేదో యుండవలెను. శరీర పాటవమును జూపవీలగు పనులలో వారి నెక్కువగా పాల్గొన జేయవలెను. కర్రపని, వడ్రంగము మొదలగునవి వారికెంతయు తగియుండును. అట్టి వానిలో పాల్గొనునపుడు వారితరులతో కలహించుటకు బదులు పనులతో పోరాడుట నలవరచుకొందురు. మరియు బాధ్యత వహించుటకును, నాయకత్వము జూపుటకును తగిన యవకాశముల గల్పించుచుంటిమేని వారి కలహాగుణము సక్రమముగ వినియోగపడగలదు. బిడ్డలు కలహా స్వభావులైనపుడు వారియెడ నమ్మిక జూపుచు తగురీతిని ప్రశంసించుచుండవలెను. లేనిచో వారితరులయెడ వైరమును, అధికారమును జూపుచు స్వార్థపరులై యుండగలరు.

## స్వంతము కావలెనను కోరిక Desire for possession)

ఇది 'ఒంటి' బిడ్డయందెక్కువగా నుండును. ఇంకొక బిడ్డ పుట్టినంతనే అతడీ కోరికను తప్పక వ్యక్తము జేయుచుండును. పూర్వమువలె తల్లి

పూర్తిగ తనదికాదని అతడామెయెడ వైరము జూపును. ఈ విధముగ బిడ్డయున్నపుడు తల్లిదండ్రులతని యెడ ఎక్కువ సహనమును, సానుభూతిని జూపుచు తమ సంపూర్ణ ప్రేమయందతనికి నమ్మికయుండునట్లు ప్రవర్తించుచుండవలెను.

చిన్నబిడ్డ లాటవస్తువులకై తరచుగ తగవులాడుచు వానిని తమ సొత్తుగ జేసికొన గోరుచుందురు. అట్టియెడ, వారెంతో చిన్నవారైనచో, పోరాడనీయక ఎవరియాట వస్తువులను వారికిచ్చుచుండవలెను. ఇద్దరికిని ఆకర్షణీయమగు నాటవస్తువు ఒకటి మాత్రమే యున్నయెడల మరియొకదానిని గూడ కొనవలెను. ఆటవస్తువులకై కలహించునపుడెల్లా బిడ్డల వేరుజేయుచు లాగికొనిన వానినాడనీయక తీసికొనుచుంటిమేని, కొన్నిదినములలో వారే కలహించుటమాని కలసియాడుట నేర్చుకొనగలరు.

బిడ్డ తన యాట వస్తువుల నింకొకనికీయ నేర్చుకొనవలదాయను ప్రశ్నగలదు. బిడ్డ చిన్నవాడైనపుడు తనవస్తువుల నెవ్వరికి నీయనక్కరలేదు. ఇతరులు తన సొత్తులను గౌరవింప నేర్చుకొనగలదు. అతని స్వార్థగుణమును తొందరగా తొలగింప ప్రయత్నించుకొలదియు అది మరింత ప్రబలము కాగలదు. ఐనను అతడేదైన తినునపుడు కొంచమితరులకుకూడ పెట్టెడిగుణమును ప్రోత్సహింపనగును. మరియతడేదైనను పెట్టవచ్చినపుడు వద్దనక తీసికొనవలెను. ఈ విధముగ వర్తించితిమేని అతడానందముతో ఇతరులకిచ్చెడి స్వభావము నలవరచుకొనగలడు. ఇతరుల కానందమిచ్చుటలో తానానందమును పొందగలడు.

బిడ్డలేవయస్సువారైనను పెద్దలు వారి సొత్తులను గౌరవించవలెను. లేనిచో వారును పెద్దల సొత్తులను గౌరవింపజాలరు. పిల్లలనడుగకయే పెద్దలు వారివస్తువులను వాడుచుందురు. పిల్లలు గూడ అట్లే వారివస్తువులను వాడుచుండిన, దండించుచుందురు. దీనివలన పిల్లలకు పెద్దలయెడ ద్వేషభావమేర్పడుచుండును.

(సశేషము)




జండు గ్రైపెనాల్

ఇది పసిబిడ్డల జీర్ణకోశ వ్యాధులన్నిటియందు మంచి గుణము యివ్వగలదు. వారికిగలుగు అజీర్ణము, ఉన్మాదము, శూల, పులిత్రేపులు, జ్వరము, విరేచనములు మొదలగువాటిని రూపుమాపి సుఖము నిచ్చును. ఆంధ్ర దేశములోను అన్ని మందుల షాపులలో దొరుకును.

సోల్ ఏజంట్లు: దామోదర్ & కంపెనీ, మద్రాసు & విజయవాడ

ధర బుడ్డి 1 కి రు. 0-14-0

# మార్పు తెచ్చిన మాలతి

శ్రీమతి ఎస్. రాజేశ్వరీరాణి

బండిదిగి లోనికొచ్చిననాడే ఆ ఇల్లు తమాషాగా, అర్థంకాని సమస్యగా మాలతి హృదయంలో నాటుకొనిపోయింది. అత్త గారికి, తోటికోడలికి మాటలు లేవని మూడు రోజులకుగాని తెలిసింది కాదు మాలతికి. అత్తగారు నోరుగలావిడ. తోటికోడలు సుగుణా అత్తగారికేం తీసి పోదు. ఆమెకు ఆమె పేరుకు ఒక్క ఆవగింజంతయినా సంబంధంలేదు. తెల్ల వారే అత్తగారు వెయ్యి సబగుళ్లు సబ గుతూ పనిఅంతాచేసి ఆవిడే మడికట్టు కొని రెండింటికి ఇంతవుడకేస్తుంది. పదికి ఫలహారాలు ముగించి అటు బావగారు, ఇటు భర్తా ఆఫీసులకి బయలుదేరుతారు. బావగారెప్పుడూ నాలుగు పదార్థాలు లేవని అరుస్తాడు. ఒక్క సాధకంతో తినలేడు. సుగుణ వంటగదికేసి చూడదు. ఫలహారాలు ముగిసిన తర్వాత తన నాలుగేళ్ల కూతురికి జడవేసి తానూ దువ్వి ముడేసుకొని ఆ చేతులతో ముఖం, చేతులు అంతా రుద్దుకొని ఇన్ని నీళ్లు చేది దబదబా పోసుకొని ముఖం మాత్రం సబ్బుతో కడుక్కొని వస్తుంది తర్వాత కళగా అంత బొట్టెట్టుకొని గదిలోకి దారి తీస్తుంది. సరిగ్గా భర్తవచ్చి వెళ్లిన తర్వాత భోజనానికి లేస్తుంది. మాలతి కావిడ తరహా ఆశ్చర్యాన్ని కలిగించింది. గదిఅన్నా వూడవదు. ఆ మురికి కూపంలో పడి నిద్రపోతుంది. మాలతి రెండు రోజులు అన్నీ గమనించింది. రాత్రి వంట సుగు ణది - వృకికీ వుడకని మెతుకు లొకనాడు గంజితోకూడిన ముద్ద ఒకనాడు.

మొదట రోజు మాత్రం "భోజనానికి రా" అంది సుగుణ మాలతిని. రెండో రోజూ పిలిచింది. మూడో రోజు మాలతి వడ్డనకుపోయింది. అత్తగారు తనతో కూడా ముభావంగా వుండిపోవడం మాల తికి కష్టమేసింది. నాలుగోనాడు అత్తగారి కన్నా ముందులేచి కాఫీపొయ్యి రాజే సింది. అత్తగారొచ్చిచూసి వెళ్ళిపోయింది. కాఫీ గ్లాసుల్లో పోసిపెట్టింది. అందరూ కాఫీ త్రాగిం తర్వాత గ్లాసులన్నీ కడిగి షెల్ఫులో పెట్టింది. తలదువ్వుకొని స్నానంచేసింది. ఆరోజుకి కూరలు ముందటి రోజు సాయంత్రమే బావగారు తెస్తారు. అత్తగారు మాలతి స్నానం చేస్తుండగా వచ్చింది. మాటాడకుండా వెళ్లిపోయింది.

భోజనాల సమయంలో బావగారు అన్నారు "అమ్మా! పులుసు చాలా

బాగుంది.'' మాలతికి సిగ్గేసింది. సుగుణని భోజనానికి రమ్మంది.

నాలుగు రోజులు ఇట్లే తిరిగిపోయినవి. ఇల్లంతా పరిశుభ్రంగా వుండడం గమనించిన కృష్ణమూర్తి ఆ రాత్రి భార్యని అడిగాడు. ''ఎన్నాళ్లు నువ్వు దిద్దుతావు?''

మాలతికి మొదట కష్టంవేసినా ''అలా అంటారేమండి? ఇల్లు పరిశుభ్రంగా వుండడంతప్పా? తప్పయితే చెప్పండి. నేనూ గదిలో కూర్చుంటాను'' అన్నది.

మూర్తి నవ్వాడు ''నీకు కోపంవచ్చినా అందంగానేవుంది మాలతీ! సంసారాన్ని దిద్దగలవు. కానీ జీవితాలని దిద్దగలవా? నువ్వు నీ సుఖాన్ని పాడుచేసుకొని వీళ్లకు సేవచేస్తూ వుండాలిసిందే. మా వదిన తరహా గమనించావా?''

మాలతి ఆలోచనలోపడ్డది. భర్త అన్నట్లు జీవితాన్ని సరిదిద్దాలి! సంసారాన్ని సరిదిద్దాలావద్దా?

''నువ్వు చేస్తున్నపని తప్పని చెప్పడం లేదు మాలతీ! మా వదిన అణగి మణిగి యుంటుందని అమ్మ ఆశపడ్డది. బస్తీ పిల్లవని నిన్ను పెళ్ళాడుతానంటే మా అమ్మ మొదట వద్దన్నది. కానీ వదిన గుణాలు క్రమేణా ఆ విడకి వంట పట్టం–తర్వాత ఆ విడ మారిపోయింది. మా అమ్మకి శాంతి చేకూర్చాలని నేను కలగనేవాణ్ణి. ఆ కల నిజమైతే నేను తప్పక ధన్యుణ్ణే! నీతో మాట్లాడుతుందా లేదా మా అమ్మ?''

భర్త మాటలు మాలతి చెవిలో పడినవి. కానీ ఆ విడ మారాడలేదు. బావగారెప్పుడూ చిరచిర లాడుతూనే వుంటారు. భార్యని అరుస్తూ వుంటారు. వారి తప్పేమిలేదు. అంతా ఆ విడతప్పే. ప్రతి చిన్నపనికి ఆక్షేపణ, నిర్లక్ష్యం. గట్టిగా అరిచి మాట్లాడటం ఆ విడ గుణాలు!

మాలతి సాయంత్రమంతా ముఖం నల్లగపెట్టుకొని పనంతా చేసింది. మరో వారంరోజులు జరిగిపోయినవి. మాలతికి చికాకు వేసింది. తెల్లవారి లేచింది మొదలు పడుకొనేదాకా పని; అత్తగారు అడ్డంవస్తుంది కాని మాలతి ''నేచేస్తాలెండి'' అంటుంది. కానీ హఠాత్తుగా ఆ సాయంత్రం తోటికోడలు పిలిచింది పేరు పెట్టి.

''నావల్లు హూనమయిపోతోంది, నేను చచ్చినా మెరుగు; నాకాచావురానంటోంది-నీతో పోటీగ పనికి రాలేనమ్మా; అన్నీ ఎగిరెగిరి చేస్తావు. ఏదో రెండు రోజులు మూడురోజులా ఎగిరి పడటానికి! కలంత కాలం కాపురం చెయ్యవలసిన వాళ్లం''

సుగుణ మాటలు నిజానికి మాలతికి ఏమీ అర్థంకాలేదు; ఆశ్చర్యంగావిన్నది. తర్వాత

"అత్తగారు పెద్దవారండి. అంతా వారే విసుగ్గా చేయడం బాగుంటుందా; ఏదోనాకు తోచిన పని నేను చేస్తున్నాను-అంతే." అన్నది మెల్లగ నిలిపినిలిపి.

సుగుణ ముఖం చిట్లించింది" తెల్లవారి వంట ఆవిడచేస్తుంది. నీకేం నేనేమీ పోటీగా చెయ్యలేను. నువ్వు ఎగిరెగిరి ఎంతకాలం చేస్తావో చూస్తాను. ఈ మాట తీసికెళ్లి అత్తగారికి చెప్పి అల్లరి పెట్టు-అందుకేకదా నువ్వు ఎగిరెగిరి చేయడం అంతా!"

మాలతికి కోపం, అసహ్యం వేసింది. ఈమె నిల్చుకోకుండా వంటగది కొచ్చింది. బావగారు 'వడ్డించనన్నారారాదా' అన్నారేమో! అవును - వారికి మాత్రం 'తల్లి' అని లేదా ఏమిటి?

ఈలోగా అత్తగారు గరిట పుచ్చుకొని వంటగదిలోకి పోవడం చూసింది. అన్నం సంగతే మర్చామన్నమాట జ్ఞప్తికొచ్చి గబగబ గదిలోకి వచ్చింది. అప్పటికే అన్నం వారుస్తూంది అత్తగారు. మాలతి రెండు నిముషాలు నిలబడ్డది. ఆమె మనసంతా చెదిరిపోయింది. రాత్రిభోజనంకూడా అత్తగారే వడ్డించింది. మాలతికి తీవ్రమైన తలనొప్పి ప్రారంభమయింది. కృష్ణమూర్తి గదిలోకి వచ్చాడు. మాలతిని చూచాడు. మాలతి మాఠాడకుండా వంటగది కొచ్చింది. అత్తగారు కంచాలు తీస్తూంది. సుద్ది పెట్టి సుగుణను లేపింది. సుగుణ బద్ధకంగా వళ్లువిరుచుకొని లేచివచ్చింది. ఒకవిస్తరే వేయడంవల్ల సుగుణ మాలతి వేపు చూసింది. "తలభారంగావుందండి" అన్నది మాలతి.

సుగుణ భోంచేసి వెళ్లిపోయింది. వంట గది సర్ది మాలతి గదికొచ్చింది. దుఃఖం వుబుకుతున్నా మ్రింగుకొని మంచంపై పడుకొంది. భర్తలేడు. సాయంత్రమే అన్నాడు 'స్నేహితునితో సినిమాకు వెళ్లుతున్నా'నని. మాలతి మ్రింగుకున్నా దుఃఖంపొంగింది. చాలా సేపువడ్చింది. తాను అన్నంతిన్నదనే అనుకొంటారు అత్తగారు భర్తాను. 'ఏంకాపురం ఇది' తెల్లవారితే మాలతికి ప్రపంచం గిఱ్ఱున తిరిగి నట్లయింది. భర్తన్నట్లు సంసారాన్ని సరిదిద్దగలిగింది తాను; జీవితాలని సరిదిద్దడమంటే మాటలా? ఆఖర్న తాను సుగుణ లాగయిపోతుందా? మాలతి గబుక్కున లేచింది. పక్కన భర్తలేడు. వంటగది కొస్తే అత్తగారు గ్లాసుల్లో పోస్తూంది కాఫీ. మాలతి ఒక్కసారి సిగ్గుతో కృంగిపోయింది. సుగుణకూడా వచ్చిన కొత్తలో తనలాగే ప్రవర్తించి వుండవచ్చు.

కాఫీ త్రాగనుంటే చచ్చినంత సిగ్గేసింది. కాఫీ ఎలాగో త్రాగి వంటకు స్నానం చేసింది. మామూలుగా అత్తగారూ స్నానంచేసి వచ్చింది. మాలతి కొద్దిగా భయపడ్డది.

"నే చేస్తానులేవంట" కరుగ్గా అంది అత్తగారు. ఆ నాడే మాలతితో మాట్లాడం.

మాలతి కంట నీరు తిరిగింది. "నేనే చేస్తానండి. రాత్రి తల నొప్పిగావుండింది" అన్నది మెల్లగ.

అత్తగారు ఈనాడు మాలతిని కళ్ళారా చూసింది. ఒక్క రాత్రికి మాలతి కళ్లు లోనికెళ్ళినవి. 'భోంచేసావా లేదా రాత్రి?' ఈ సారి అత్తగారి గొంతు కరుగ్గా లేదు.

మాలతి కంటనీరు గిఱ్ఱున తిరిగింది. "అవి అత్తగారెక్కడ చూస్తుందో అని తలవంచింది." అత్తగారు దగ్గిరకొచ్చి "ఏడవడం దేనికమ్మా? నీవు సుగుణలాగా వుంటావని నేను అనుకోలేదు. దాని మాటలకు నీ సమాధానం విన్నాను. నువ్వు నాకు సరోజ ఎలాంటిదో అలాంటిదానివి. ఈ పూటకు నేచేస్తాలే" అన్నది మాలతి ముఖం వికసించింది. అత్తగారు తనతో అలా మాట్లాడినందుకు. మరునాడు సుగుణ వంటకు స్నానం చేసింది మాలతి వచ్చేసరికి. ఆరాత్రి మూర్తి మాలతితో అన్నాడు "చాల గట్టిదానివే-ఏదో అనుకొన్నాను. జీవితాలనికూడ సరిదిద్ద గలిగావు." మాలతి సిగ్గుపడ్డది; మార్పు ఎలా వచ్చిందో ఆమెకు సమస్యే అయింది.

---

సంపాదకీయములు 279 పేజి నుండి

ప్రతివ్యక్తి బాధ్యతను గుర్తించి శక్తివంచన లేకుండా కృషి చేయడం తన శ్రేయస్సును, దేశ శ్రేయస్సును ప్రపంచకళ్యాణాన్ని ఉద్దేశించి జరుగవలసినది. అలా తయారు చేయడానికనువైన విధానం ఆకర్షణీయంగా ఎప్పుడు రూపొంది అమలు జరగనున్నదాయని అభ్యుదయ కాముకులు ఎదురుచూస్తున్నారు.

ఈనాటి మన జీవిత వ్యయ ప్రమాణము చాల తక్కువేయయినా పెరగడానికి దేశపు విస్తీర్ణమున్నది, సహజ సంపదలున్నవి; ప్రజాశక్తిసామర్థ్యాలున్నవి; ఉన్న వసతులను వినియోగించుకోగలిగిననాడు నిరుద్యోగుల సంఖ్య అత్యంత పరిమితం కాగలదు.

జనాభా పెరుగుదలమాత్రం నిరుద్యోగ వ్యాపికి కారణం కాదేమో. శక్తిసామర్థ్యాలుండి యోగ్యతల ననుసరించి ఏదో ఒక వృత్తిని ప్రతియొక్కడు అవలంభించి జీవనోపాధిని కల్పించుకోడానికి అవకాశమున్నప్పుడు జనాభా పెరుగుదల వలన నష్టం రాదు.

సోమరితనాన్ని ప్రభుత్వము సహించకుండా దేశంలో సాగుకనువైన భూమిని ప్రతి అంగుళం జాతీయ శ్రేయస్సుకు వినియోగపడేలాగునను, సహజ సంపదలను పూర్తిగా వినియోగించుకొనేలాగునను పూనుకొనినప్పుడు జనాభా పెరుగుదల, నిరుద్యోగ విస్తరణ పరిమితం కాగలవు.

విద్యార్థులు సయితం తమ విద్యా విజ్ఞానములను ఏ గుమాస్తాగిరికనియో ఉద్దేశించకుండా జాతీయ శ్రేయస్సుకు రూపొందించడంలో ఏ వృత్తియైనా గౌరవప్రదమైనదే అనియు, ఇందులో ఉత్తమ, అధమ, తరతమ స్థాయిలు ఏమి లేవని గుర్తించి పరస్పరము అభిమానించుకొని, సానుభూతితో వ్యవహరించి తమ భవిష్యత్తు జీవితాలను రూపొందించుకొనినచో జాతీయ ఆర్థిక వ్యవస్థలో విప్లవాత్మకమైన మార్పు రాగలదు. అట్టి దానిని ప్రోత్సహించనున్న విద్యా విధానము రూపొందవలసియున్నది.

(256 పేజి తరువాయి)

పిల్లా ఎప్పుడూ యిల్లా వుండాలితెలుసా మూతి ముడుచుకున్ని కుంటే నాకు మా చెడ్డకోపంవస్తుంది, అంటూ మీదికి రాబోయాడు. విజయ బాల తప్పి కొని - వుండండి త్వరపడతారేం? నానియను మొల్లం ఘన చేస్తారేమిటి? రెండు నెలల ఓపిక పట్టండి - అంది. ఆక్షణంలోనే ఎక్కడలేని ఏడుపు తెచ్చి పెట్టుకొని మీరు దేశదేశాలూ తిరుగుతుంటిరి. మిమ్మల్ని ఎవరయినా చంపితే నాగతి ఏంకానూ? అని దొంగఏడుపు ఏడిచింది.

రాక్షసుడు (ముని) వుబ్బిపోయి - పిచ్చిదానా? భయపడతావెందుకు ప్రాణాన్నిగురించి? అసలు నా ప్రాణం ఎక్కడుందో తెలుసా? ఇక్కడనుండి సరాసరి పడమర దిశగా పోవాలి. అలాపోయిన తర్వాత ఐదు పచ్చ సముద్రాలు తగులుతై. మరివాటిని దాటటం యెల్లా అని అడుగుతావేమో. సులభంగా దాటేట్లయితే ఇంతా చెప్పటమెందుకూ? ఆ సముద్రాలవతలనుండి దక్షిణదిక్కుగా పోయిన ఒక పెద్ద పుట్టవచ్చును. ఆ పుట్టలో భయంకరమైన పాములు కాపలా కాస్తూవుంటాయ్, వాటిని తప్పించుకోవటం నరుడి తరంకాదు.

(సశేషము)

---

## సభలూ సమావేశములు

ఏప్రెలు నెల 12వ తేదీన పశ్చిమ గోదావరి జిల్లా, పోలవరం తాలూకా యందలి కొయ్యల గూడెంలో గెడా గెరటయ్య బోర్డు హైస్కూలుకు చెందిన శ్రీమతి మద్దిపోటు వెంకటరత్నమ్మ హరిజన హాస్టలును ఆంధ్ర ముఖ్యమంత్రి గౌరవనీయులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ప్రారంభోత్సవముచేశారు.

ఈ హాస్టలుకు శ్రీమతి కానుమిల్లి వెంకటనరసమ్మగారు తమ అక్కగారి పేరిట నిర్మాణమునకు రు. 10000 లు విరాళమివ్వగా ఆంధ్ర ప్రభుత్వము వారు రు. 10000లు స్పెషలు గ్రాంటు మంజూరు చేసినారు.

హాస్టలు ప్రారంభోత్సవ సమయమున శ్రీ గోపాలరెడ్డిగారు 10 సంవత్సరముల క్రిందట మనమింత అభ్యుదయాన్ని యీనాడు సాధించకలుగుతామని అనుకోలేదనియు, స్వాతంత్ర్యము సిద్ధించిన తరువాత ప్రజలకు విద్యా సౌకర్యములు, ప్రత్యేకముగా హరిజనులకు అనేక విధములుగా కాంగ్రెస్ ప్రభుత్వము సహాయము చేయుచున్నదనియు, యికముందుకూడ ప్రజాసహకారముతో రెండవ పంచవర్ష ప్రణాళికలో అభివృద్ధి కార్యక్రమాలు నిర్వహింపబడగలవనియు విశదీకరించారు.

ముఖ్యమంత్రిగారు ఆ గ్రామములో కోయ మహిళాభ్యుదయము నుద్దేశించి జరుగుచున్న కార్యక్రమాలను పరిశీలించి వానిని నిర్వహిస్తున్న కుమారి కె. సత్యవతిగారికృషిని ప్రశంసించారు. కోయ స్త్రీలకు విద్యా విజ్ఞానాలతోబాటు తీరిక వేళలందు జీవనోపాధి కుపకరించు గృహపరిశ్రమలయందు సయితము శిక్షణ నీయవలసినదిగా శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు సలహా నిచ్చిరి.

14—4—1956న శ్రీ గెడా గెరటయ్య బోర్డు హైస్కూలు వార్షికోత్సవము శ్రీ శీర్ల బ్రహ్మయ్య M. L. A. గారి అధ్యక్షతన వైభవముగా జరిగెను.

ఆంధ్రరాష్ట్ర సహకార సంఘముల రిజిస్ట్రారు కే. సుబ్రహ్మణ్యం నాయుడుగారు వార్షికోత్సవమును ప్రారంభించిరి.

శ్రీ బండి శ్రీహరిరావు నాయుడుగారు విద్యార్థులకు బహుమతులను పంచిపెట్టిరి.

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

శ్రీ కల్లూరి. అహోబలరావు.

(గతసంచిక తరువాయి)

౨౧

సీ. వైదేహి లోచన పద్మంబులకినుండు,
పూర్ణ చంద్రుని వంటి మోమువాఁడు
సీత మానసమునఁ బ్రీతి నుండెడివాఁడు
శ్రీ కరుండయి, సదా చెలఁగువాఁడు
జానకి మోహింపఁజాలు, సొబగువాఁడు
దయ కల్గినట్టి నేత్రములవాఁడు
సీతా మహాదేవి చెక్కిళ్ల దర్పణ
మందు, వెలింగెడి యందగాఁడు

గీ. చందనము వంటి శీతలస్వామి - మమ్ము
చల్లగా నేలుగావుత! యుల్లమందు
కొల్లలాడెడి వేదనల్ పెల్లగించి
సల్లలిత, చిత్తశుద్ధి నొసంగి సతము.

౨౨

సీ. చంద్రుని, రవిని లోచనములుగాఁగల్గి
కోటి సూర్యులవంటి మేటి కాంతిఁ
దళతళ మెఱసెడి నళినలోచనుఁడ! శ్రీ
కాలస్వరూప! విఖ్యాత పురుష!
శరచాపములను, ప్రశస్తాయుధముల, హ
స్తమునందు బూనిన చారుచరిత!
ప్రళయాగ్ని కరణిని భయమును పుట్టించి
భీమాట్టహాసుఁడై, విఘ్నితతులఁ

గీ. గొట్టి, శత్రువంశంబుల మట్టుఁబఱచి
యభయ మొసఁగితి వీవు! లోకాళికెల్ల

రామ! శ్యామాభిరామ! ప్రార్థన మొనర్తు
నామనోదుఃఖముల, బాపుమా! ముకుంద!

౨౩

గీ. దశరథాత్మజుని, గుణకథామృతంబు
రాఘవేశ్వరుని, గుణకీర్తనము, లక్ష్మ
ణాగ్రజుని, పాదసేవయు సబ్బుగాత!
జన్మ జన్మంబులను నాకు, సత్యముగను.

౨౪ (ఎ)

కం. రాముఁడు, నాకుల దేవత
రా మునిచేఁ బాపరాశి రహీనశియంచుక్
రాముని కంటెను సులభుఁడు
భూమిస్థలి లేడు లేడు బొలుపుగ వెదకన్

౨౪ (బి)

కం. రాముని దాసుఁడ నేనే
రాముఁడె నావంశ గురువు; రామునిపై, నా
కేమో - మిక్కిలి యిష్టము
రాముని నే నా దరమునఁ బ్రార్థన చేతున్

౨౫

సీ. శ్రీరామ! నీ కీర్తి స్థిరకల్పకంబాయె
భువనంబు పాదయి పొలుపు మీఱె
నాగలోకము మొదలుగాగ, నాకాశంబు
ప్రూనయి వెలసెను మాన్యముగను
దిక్కులు గొమ్మలై తేజరిల్లుచు నుండెఁ
జుక్కలు బువ్వులై చోద్యమొసఁగె
నిండు చంద్రుఁడు, తీపి పండయి ముదమిచ్చె
అమృతధార లొసంగి హాయిగాగ
గీ. రామ! శ్రీరామ! రఘురామ! రామచంద్ర!
నిన్నుఁ బొగడంగ నేనేర సన్నుతాంగ!

నాదు లోపంబులను బాపి మోదమొసఁగ
ప్రార్థనము జేతు సతతంబు ప్రణతు లొసఁగి.

౨౮

సీ. పులకాంకురము గల్గు భూజాత సీతను
ముదమునఁ గౌగిలింపుల, నొనర్చి
వామ స్తనాగ్రంబు వామ హస్తముతోడఁ
దాకి, దక్షిణపు హస్తంబునందు
జ్ఞాన ముద్రవహించి, జ్ఞానోప దేశంబు
సురుచిరానందమౌ సూక్తితోడ
మతిమంతుఁడౌ, హనుమంతన కొనరించి
యతఁడు, సేవింపగా నలరినావు
గీ. డంబుగా, రాజ్య సింహాసనంబునందు
మఱియు చున్నావు శ్రీరామ! ముక్తి వరద!
నిన్ను సతతంబు సేవించు నిర్మలులకు
రక్ష యొసఁగుము రాఘవా! రామభద్ర!

౨౯

సీ. ఒక చేత ధనువు, వేరొక చేతఁ జక్రంబుఁ
గుడి చేత శంఖంబుఁ దొడిగినావు
మఱియొక్క కుడి చేత మహిమ బాణంబును
భరియించియున్నావు భద్రముగను
వామాంకమున, జానకీ సహితాశిరో
మణియొక్క- కంకణక్వణము సెలఁగ
భద్రాద్రి భూషణ ప్రాప్తిచేఁ జెలువొంది
రఘు రాజరత్నమై రామచంద్ర!
గీ. నాల్గు చేతులతోడ, విన్నాణముగను
కరము శోభించు చున్నావు కమల నేత్ర!
శ్యామలాకార! రఘుపతీ! సత్యచరిత!
నిన్ను సేవింతు సతతంబు నిశ్చలముగ

(సశేషము)




**గృహాలంకరణ - ముగ్గులు:** శ్రీ గొల్లపల్లి వెంకటేశ్వరరావు, 20/389 ఏలూరు రోడ్డు, గవర్నరు పేట, విజయవాడ 2. వెల రు. 2-0-0.

భారత ప్రభుత్వము సార్వజనీన సారస్వతమును ప్రోత్సహించుటకుగాను 1954 సం|| జరిపిన పోటీలో 1955 సం|| రిపబ్లిక్ దినోత్సవ సందర్భమున నీ గ్రంథము ప్రథమ శ్రేణిలో బహుమతి నందుకొన్న వానిలో నొకటి.

గ్రంథ కర్త సుప్రసిద్ధ చిత్రకారులును అగుటచేత వీరు ముగ్గులను గురించి చేసిన పరిశోధన, కృషి అమోఘంగా రాణించినవి. ఇది స్త్రీలకు మాత్రమే పఠనీయము కాక పురుషులకు సయితము ముగ్గులలోని కళాపిపాసను, శోభను చక్కగా వివరించుచున్నది.

అమూల్యమైన ముగ్గులను గురించిన కళావిశేషాలను చిత్ర రచనతో వివరించిన గ్రంథకర్త అభినందనీయుడు.

**కావ్యవనము:** శ్రీ దువ్వూరి రామలింగారెడ్డి. ప్రచురణకర్తలు: మహతీపబ్లికేషన్స్, వాకాడు, నెల్లూరు జిల్లా. వెల 0-8-0.

ఇది ఖండ కావ్య సంపుటి. కవిత అనర్గళమై ఉత్తమ సాంప్రదాయములతో భావరసభరితంగా విరాజిల్లుచున్నది.

శైలిసైతము సరళమగుటచే పండితపామరులు పఠించి ఆనందించుట కవకాశమున్నది. గ్రంథకర్త పాండిత్య రచనానైపుణ్యాలు ప్రశంసనీయములు.

**పాణిగృహీతి - పెండ్లము:** శ్రీరామకృష్ణకవులు. ప్రకటన కర్త; విదూషక విద్వాన్ ఆకుండి వెంకటశాస్త్రిగారు, 17 గోవిందరాజస్వామి తేరు వీధి, తిరుపతి.

ఇందలి పద్యములు కల్యాణవేదికకడ సమర్పించునవి. వధువరుల నుద్దేశించి ఆయురారోగ్య ఐశ్వర్యముల నాశీర్వదించుచు పెండ్లివేడుకలను, వైవాహిక జీవితమును పరిచయము చేయునట్టి వీపద్యములు. రచన సరళంగా భావరస పోషణలతో సాగింది.

**శ్రీ గీతా సూత్ర రత్నమాల:** శ్రీ నిర్వికల్పానంద స్వామివారు. ప్రకాశకులు: శ్రీ గీతా సాహిత్య సేవాసమితి, ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా. వెల 0-4-0.

'భారద్వాజీయ ప్రణవ బ్రహ్మజ్ఞానానంద సూత్ర రత్నమాల'ను శ్రీ స్వామివారు ఆంధ్రానువాదం చేశారు. గీతనంతటిని నిరంతరము చదువజాలనివారు యీ సూత్ర పంక్తులను అనుదినము అనుసంధానించిన గీతాహృదయము తెల్లమగును.

అనువదించబడిన సూత్రములు తెలుగు ప్రజానీకమునకు విశేషంగా నుపకరించగలవు.

# సంపాదకీయములు

## శిశుసంక్షేమం - ప్రభుత్వ బాధ్యత

భారత ప్రధాని పండిత జవహర్లాల్ నెహ్రూ ప్రస్తుతము మన దేశంలో శిశు సంక్షేమంపట్ల గల నిర్లక్ష్య వైఖరికి విచారమును ప్రకటిస్తూ యీనాడు మనం శిశు సంక్షేమం పట్ల ఎక్కువ శ్రద్ధ వహించక పోయినచో భవిష్యత్తులో యింకా ఎక్కువ సమస్యలు ఉత్పన్నము కాగలవనియు, జాతీయాభివృద్ధి పథకాలలో శిశు సంక్షేమ ప్రణాళికలకు ప్రాధాన్య మివ్వాలని పేర్కొన్నారు.

పిల్లల విషయంలో సామాన్య ప్రజానీకము తగు శ్రద్ధ వహించకపోవడానికి అనేక కారణాలున్నవి. ముఖ్యంగా ఆర్థిక దుస్థితి, దాని ననుసరించిన ఆహార, నివాస వసతులలోటు, అవసరమైన వైద్య సహాయం, ఆరోగ్య కేంద్రాలు సామాన్య ప్రజానీకానికందుబాటులో లేకపోవడం పేర్కొనదగినవి.

ఈనాటి బాలలు రేపు బాధ్యతల నిర్వహించవలసిన పౌరులు కావలసినవారు. వారి ఆరోగ్య సౌష్ఠవాలను నిర్లక్ష్యం చేయడము క్రమంగా భవిష్యత్తులో తరతరానికి భారతజాతి నిర్వీర్యం కావడమునకు కారణము కాగలదు. కాని ప్రధాన నిత్యావసరాలు కూడు గుడ్డలాంటి వాటికే గిజగిజలాడుతున్న ప్రజానీకం తమ ఆరోగ్యంపట్ల, తమ పిల్లల సంక్షేమంపట్ల ప్రభుత్వ సహకార సహాయాలు లేనిదే ఎక్కువ శ్రద్ధ వహించకలిగేది యుండదు.

ప్రజల ఆదాయం పెరగాలి. ప్రధాన జీవితావసరాలకు లోటుండకూడదు. పిల్లల ఆరోగ్య సౌష్ఠవాలకు తల్లిదండ్రుల ఆరోగ్యంకూడ ప్రధానం కాబట్టి జాతీయ ఆరోగ్యాన్ని పెంపొందజేయడానికి వైద్య వసతులను విస్తృతం చేయాలి. బాలలకు ఆర్థిక దుస్థితి తెలియకుండా నిత్యావసరాలు - ఆరోగ్యకరమైనట్టియు, పుష్టికరమైనట్టి ఆహారం, నివాస వసతులు, ఉడుపులు, విద్యా విజ్ఞాన, వినోదాలు సమకూరాలి. ఇవి అన్నియు సమకూరినప్పుడు బాలలు ఆరోగ్యవంతులై శరీరావయములతోబాటు బుద్ధిబలము కూడ పెంపొంది భవిష్యత్తులో దేశానికి, జాతికికూడ విశేషముగా నుపయోగపడేలాంటి పౌరులుగా రూపొందగలరు. దానినే శిశు సంక్షేమ ప్రణాళికలు సాధించవలసినది. ఇందుకు ప్రభుత్వ కృషి, ప్రజా సహకారము అత్యవసరము.

## జాతీయ విద్యా విధాన స్వరూపము

ఇండియా వైస్ ప్రెసిడెంటు డా॥ రాధాకృష్ణన్‌గారు మన జీవిత వ్యయప్రమాణము చాల తక్కువని, మన ఆర్థికాభివృద్ధి జనాభా పెరుగుదలకు అనుగుణంగా లేదనియు, క్రమంగా నిరుద్యోగుల సంఖ్య పెరిగిపోతూనే యున్నదనియు, యీ పరిస్థితులలో కళాశాలలు, పాఠశాలలు జాతీయ నిర్మాణ కార్యక్రమాలలో పాల్గొనగల వారిని తయారుచేయునట్టిదిగా విద్యా విధానం తోడ్పడాలి అని న్యూఢిల్లీలో ఉపన్యసిస్తూ చెప్పారు.

జాతీయ నిర్మాణ కార్యక్రమాలలో పాల్గొనడానికి ఏదో ఒక విధంగా ప్రతి వ్యక్తి తయారు కావలసియున్నది. అది బుద్ధిబలము, శక్తి సామర్థ్యాలు, యోగ్యతల ననుసరించి జాతీయ నిర్మాణంలో

(తరువాయి 273 పేజీలో చూడుడు)

## శ్రీ దుర్ముఖినామ సం॥ర వైశాఖ, జ్యేష్ఠమాసములు

| | | | |
|---|---|---|---|
| 1956 సం॥ మే నెల | 16 | బు | స 52.30 పుష్య 10.54 త్యా 3.44 |
| | 17 | గు | అ 46.48 ఆశ్రే 6.44 త్యా 3.46 |
| | 18 | శు | న 41.51 మఖ 3.9 త్యా 3.49 |
| | 19 | శ | ద 37.54 పూఫ 0.25 ఉఫ 58.0 |
| | 20 | ఆ | ఏ 35.4 హస్త 57.50 అమృత సిద్ధియోగం |
| | 21 | సో | ద్వా 33.26 చిత్త 58.29 త్యా 4.3 |
| | 22 | మం | త్ర 33.1 స్వా 60.10 త్యా 4.9 |
| | 23 | బు | చతు 33.48 స్వా 0.30 త్యా 4.14 నృశింహ జయంతి, త్యా |
| | 24 | గు | ○ పౌ 35.44 విశా 3.40 వ్యాస పూర్ణి చంద్రగ్రహణం, కంచి వరదరాజ స్వామి గరుడోత్సవం. |
| | 25 | శు | కృపా 38.38 అనూ 7.44 త్యా 4.20 |
| | 26 | శ | విది 42.18 జ్యే 12.39 త్యా 4.23 |
| | 27 | ఆ | త 46.33 మూ 18.11 త్యా 4 23 |
| | 28 | సో | చ 51.3 పూషా 24.6 త్యా 4.24 |
| | 29 | మం | పం 55.33 ఉషా 30.7 త్యా 4.24 దగ్ధ యోగం. |
| | 30 | బు | ష 59.49 శ్ర 36 0 గోదావరి పుష్కర ప్రవేశం. |
| | 31 | గు | స 60.10 ధ 41 26 త్యాజ్యా భావః |
| 1956 సం॥ జూన్ నెల | 1 | శు | స 3.2 శత 46.14 త్యా 4.20 |
| | 2 | శ | అ 6.11 పూభా 50.5 త్యా 4.16 |
| | 3 | ఆ | న 8.1 ఉభా 52.52 త్యా 4.12 |
| | 4 | సో | ద 8.43 రే 54.28 త్యా 4.7 |
| | 5 | మం | ఏ 8.14 అశ్వ 54.50 త్యా 4.2 |
| | 6 | బు | ద్వా 6.28 భ 53 57 త్యా 3.57 |
| | 7 | గు | త్ర 3.31 ఏవ్యం 56.11 కృ 51.55 త్యా 3 52 మాస శివరాత్రి |
| | 8 | శు | ● అమా 54.34 రో 48.55 త్యా 3.48 |
| | | | **జ్యేష్ఠ మాసము** |
| | 9 | శ | శుపా 48.4 మృ 45.7 త్యా 3.45 |
| | 10 | ఆ | వి 42.19 ఆర్ద్రా 40.49 త్యా 3.43 భానువిదియ |
| | 11 | సో | త 35.43 పున 36.14 త్యా 36.14 త్యా 3.42 రంభా గౌరీవ్రతం |
| | 12 | మం | చ 29.8 పుష్య 31.40 త్యాజ్యా భావః ఉమా వ్రతం కుల చతుర్థి |
| | 13 | బు | పం 22.50 ఆశ్రే 27.24 తిథి ద్వయం |
| | 14 | గు | ష 17.4 మఖ 23.42 |
| | 15 | శు | స 12.2 పూఫ 20.45 త్యా 3.53 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.





పుష్కరిణి (తిరుచానూరు)





పుష్కరిణి (దిగువ తిరుపతి)

By Sri S. T. Arasu



ప్రాణాయామం పట్టి
ముళ్ళ పరుపు మీద పడు-
కోవడం సన్యాసికి చేతనయితే

# లోధ్ర




సేవించి ఆరోగ్య ★★★
సౌందర్యాలు పెంపొందించు
కొంటూ ఉత్సాహంగా వుండ
డము ఆమె చేతనవును.
"లోధ్ర" ఋతు దోషాలను
పారద్రోలి ఆరోగ్య సంతోష
సంతానములను సంప్రాప్తింప
జేయును



కేసరి కుటీరం లిమిటెడ్,
రాయపేట, మద్రాస్.

Lodhra Press, Madras-14.